# సృజన

ఆధునిక సాహిత్యవేదిక

మాసపత్రిక



నిర్వహణ

'సాహితీమిత్రులు'

190

ఆగస్ట్ 1991

# సృజన

## ఆధునిక సాహిత్య వేదిక

| 190 | మాసపత్రిక | ఆగస్ట్ 1991 |
|---|---|---|


ఈ సంచికలో....




నిర్వహణ

సాహితీమిత్రులు

ఈ సంచిక రు. 5. సంవత్సర చందా రు. 50

Edited, Printed and Published by P. Hemalatha, Flat 11, Block 2, MIG II, Baghlingampalli, Hyderabad-500 044 and Printed at Nagendra Press, Vijayawada-520 002

Working Editor : Vara Vara Rao

సంపాదకీయం :

# ఐ. ఎం. ఎఫ్. దాడి – ఎరువులకై ఎదురుదాడి

రెండు దశాబ్దాల కింద నక్సల్బరీ మార్గం భారత ఆర్థిక వ్యవస్థ గురించి ఏ నిర్ధారణలను ప్రజల ముందు ఉంచిందో, అవే నిర్ధారణలను ఇప్పుడు స్వయంగా కాంగ్రెస్ పాలకులు, వాళ్ళ సిద్ధాంతవేత్తలు మరోవైపు నుంచి చెపుతున్నారు. భారత ఆర్థిక వ్యవస్థ సంక్షోభం తీవ్రతరమైందని వాళ్ళు అంటున్నారు. నాలుగు దశాబ్దాలుగా తాము నడిపించుకు వచ్చిన ఆర్థికాభివృద్ధి మార్గం లోపభూయిష్టమైనదని, విఫలమైందని పాలకవర్గాలు ఇవాళ బాహాటంగా ప్రకటిస్తున్నాయి. ఈ మధ్యకాలపు ప్రభుత్వ ప్రకటనలలోను, ఆచరణలోను, కొత్త బడ్జెట్ లోను, కొత్తగా ప్రవేశ పెట్టిన వాణిజ్య, పారిశ్రామిక విధానాలలోను ఈ అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి.

భారత ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో పడడం, ఆ సంక్షోభాన్ని గుర్తించడం ఇది మొదటిసారి కాదు. ఒకసారి విషాదంగా అంతమైన చరిత్ర మళ్ళీ ప్రహసనంగా పునరావృతమవుతుందని మార్క్స్ చెప్పినట్టు భారత ఆర్థిక సంక్షోభం కూడ వలస పాలనలో విషాదమై, అర్థవలస, అర్థ భూస్వామ్య పాలనలో అనేక సార్లు ప్రహసనమవుతున్నది. ఈసారి ప్రహసనం అన్నిటిలోకీ పెద్దది మాత్రమే కాక, ఈ సంక్షోభం పేరు మీద పాలకులు ప్రవేశ పెట్టబోతున్న విధానాలు తీవ్రమైనవి.

నిజానికి భారత ఆర్థిక వ్యవస్థలో సంక్షోభం ఎక్కడ ఉంది? ప్రభుత్వ లెక్కల ప్రకారమే వ్యవసాయ, పారిశ్రామిక రంగాల ఉత్పత్తులు, మొత్తంగా ఆర్థిక వ్యవస్థ ఏటేటా 'అభివృద్ధి'నే చూపుతున్నాయి. కనుక ఉత్పత్తి రంగంలో సంక్షోభం లేదనే చెప్పాలి. ఈ ఉత్పత్తులు ప్రజలందరికీ న్యాయంగా, సమానంగా అందక పోవడంలోనే, కచ్చితంగా చెప్పాలంటే పంపిణీ రంగంలోనే అసలు సంక్షోభం ఉన్నది. ఉత్పత్తి సాధనాల మీద యాజమాన్యం ఎవరిదనే విషయంలో, ఉత్పత్తి ఫలాన్ని ఎట్లా పంపిణీ చేయాలనే విషయంలో నిజంగా భారత ఆర్థిక సంక్షోభం ఉన్నది. ఈ సంక్షోభాన్ని దాచి ఉంచడానికి, మసిబూసి మారేడుకాయ చేయడానికి పాలకవర్గాలు మరొక సంక్షోభాన్ని చూపుతున్నాయి. అది విదేశీ మారక విలువల సంక్షోభం.

భారత ఆర్థిక వ్యవస్థ చేసే ఎగుమతులు, తనలోకి తెచ్చుకునే దిగుమతుల కన్న తక్కువైనప్పుడు విదేశీ మారక విలువల సంక్షోభం తలెత్తింది. 1947 ఆగస్టు 15 నాటికి విదేశీ మారక నిలువలలో సంతృప్తికరమైన స్థితిలో ఉన్న భారతదేశం ఈ గడిచిన నలభై ఏళ్ళలో ఎన్నోసార్లు ఖజానా ఖాళీ అయి చప్పన్నారు దేశాల దగ్గర జోలె పట్టవలసిన స్థితికి వచ్చింది. ఇప్పుడు కూడ మరొకసారి భారత

ప్రభుత్వం దగ్గర విదేశీ మారకద్రవ్యం అంతా కరిగిపోయి దిగుమతుల బిల్లులు చెల్లించలేని స్థితి వచ్చింది. ప్రభుత్వం దీన్నే దేశం మొత్తానికీ ఎదురయిన సంక్షోభంగా చూపి అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ దగ్గరికీ, ప్రపంచ బ్యాంకు దగ్గరికీ, సామ్రాజ్యవాద అగ్రరాజ్యాలన్నిటి దగ్గరికీ పరుగులు తీసింది. తత్ఫలితంగా ఆ యా సామ్రాజ్యవాద శక్తులకు మన ప్రభుత్వ విధానాలను శాసించగల శక్తి ఇంకా పెరిగింది.

ఇది ప్రస్తుత సంక్షోభపు రూపం. ఈ రూపానికీ అసలు సారాంశానికీ చాల తేడా ఉంది. రూపమూ సారమూ ఒకటే అయితే జ్ఞానమే అనవసరమై పోతుందన్నాడు మార్క్స్. అందుకే ఈ రూపంలో కనబడుతున్న అంశాల సారాన్ని గ్రహించవలసి ఉంది.

మొట్టమొదట ఇవాళ్టి ఆర్థిక సంక్షోభం ప్రజలదా, పాలకులదా అని ప్రశ్నించి జవాబు చెప్పుకోవలసి ఉంది. ఇది ప్రధానంగా ఎగుమతి-దిగుమతుల తేడా వల్ల వచ్చిన సంక్షోభమే గనుక ఈ జవాబును అక్కడే వెతకాలి. భారతదేశపు ఎగుమతులు ఎందుకు పెరగలేకపోయాయి? దిగుమతులు ఎందుకు పెరిగాయి? ఎగుమతులు పెరగాలంటే మన ఉత్పత్తి శక్తుల సృజనాత్మకతను పూర్తిగా వినియోగించుకోవాలి. మన ఉత్పాదక సామర్థ్యాన్ని పెంచుకోవాలి. అంతర్జాతీయ మార్కెట్లలో పోటీ పడగల నైపుణ్యాన్ని అలవరచుకోవాలి. వీటినే మరో మాటల్లో చెప్పాలంటే మన ఉత్పత్తి శక్తుల మీద ఉన్న అర్థ భూస్వామ్య, అర్ధవలస బంధనాలు తొలగిపోవాలి. మన ఉత్పత్తి శక్తుల ప్రాపంచిక దృక్పథంలో గుణాత్మకమైన మార్పులు రావాలి. ఈ మార్పులు రావడం పాలక వర్గాల ఉనికికే ప్రమాదకరం గనుకనే ప్రజల మీద హింసాకాండ పెరిగిపోతున్నది. ప్రజలను బంధనాలలోకి నెట్టివేసే ప్రయత్నం పెరుగుతున్నది. కనుక ఎగుమతుల సంక్షోభం పాలకవర్గాల సృష్టి మాత్రమే. ఆ సంక్షోభ పరిష్కారానికి ప్రధానమైన అడ్డంకి పాలకవర్గాలే.

ఇక మన దిగుమతులు ఎందుకు పెరిగిపోయాయి? నిజంగా భారతదేశం దిగుమతి చేసుకుంటున్న వస్తువులన్నీ భారత ఉత్పత్తి శక్తులు ఉత్పత్తి చెయ్యలేని బ్రహ్మ పదార్థాలేనా? ఒక్క బ్రిటన్‌కు వలసగా ఉన్న స్థితి నుంచి, సకల సామ్రాజ్యవాద దేశాలకు అర్ధ వలసగా మారిపోయిన తర్వాత మన పాలకులు భారత మార్కెట్‌ను, భారత ప్రజా జీవనాన్ని తాకట్టుపెట్టి తమ భోగాలు చూసుకున్నారు. స్వావలంబన దిశగా పయనించవలసిన ఆర్థిక వ్యవస్థ పిన్నీసులు, పెన్నులు, పెన్సిళ్ళు, బొమ్మలు కూడ దిగుమతి చేసుకునే దిశలో పయనించింది. సమాజంలో కన్స్యూమరిస్ట్ సంస్కృతిని పెంచి పోషించి, ఆ సంస్కృతికి బలి అయిన

పిడికెడు మంది అవసరాల కోసం దిగుమతులు చేసుకునే పద్ధతి మొదలైంది. వేలాది కోట్ల రూపాయల ప్రజాధనం కొన్ని వేల మంది అవసరాలు తీర్చడానికి విదేశీ బొక్కసాలకు తరలిపోయింది. అవే వస్తువులను మన ఉత్పత్తి శక్తుల చేత తయారుచేయించి ఉండవచ్చును. దిగుమతులు మీద ఆంక్షలు విధించి ఉండవచ్చును. కొన్ని రకాల దిగుమతి వస్తువుల వినియోగానికి వ్యతిరేకంగా విలువల పోరాటం నడిపి ఉండవచ్చును. కాని ఈ దిగుమతులిట్లా కొనసాగడమే పాలక వర్గాల అవసరం. దేశంలో అసంఖ్యాక రైతుల, శ్రామికుల చెమటనూ నెత్తుటినీ కొన్ని వేలమందికి దోచిపెట్టి, తమ పబ్బం గడుపుకోవడం కోసం పాలక వర్గాలు చేసిన కుట్ర ఇది. అంటే దిగుమతుల సంక్షోభం కూడ ప్రజల సంక్షోభం కాదు. పాలకులు సృష్టించిన ఘాతం అది. దాన్ని ఇప్పుడిప్పుడే మట్టుబెట్టడం కూడ పాలకులకు ఇష్టం లేదు.

ఇట్లా తమవల్ల తలెత్తిన సంక్షోభాన్ని పాలకులు ప్రజలందరి సంక్షోభంగా ప్రకటిస్తున్నారు. ఆ సంక్షోభ అసలు పరిష్కారానికి తామే అడ్డంకి అనే విషయాన్ని ప్రజలు తెలుసుకోకుండా ఉండేందుకు అనేక తప్పుడు పరిష్కారాలు చూపుతున్నారు. అటువంటి తప్పుడు పరిష్కారాలలో ఒకటి, సామ్రాజ్యవాద ఆర్థిక సంస్థలు నిర్దేశించే విధానాల్ని అమలు చెయ్యడం. అప్పుకోసం వెళ్ళినప్పుడు ఆత్మాభిమానం అమ్ముకోక తప్పదనే లోకోక్తితోనూ, 'మనం మన వనరులను మించి జీవిస్తున్నాం' అనే అబద్ధంతోనూ పాలకులు తమ విధానాల దుష్ఫలితాలను ప్రజలమీదికి నెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. అప్పుకోసం ఎందుకు వెళ్ళవలసి వచ్చిందనే ప్రశ్నను, ఎవరు వనరులను మించి జీవిస్తున్నారనే ప్రశ్నను దాటవేస్తున్నారు.

సామ్రాజ్యవాద ఆర్థిక సంస్థలు, దేశాలు తప్పనిసరిగా షరతుల మీదనే అప్పులిస్తాయి. దేశాన్ని తమ మార్కెట్‌గా మార్చివేయాలంటాయి. ఆర్థిక వ్యవస్థ తమ అవసరాలకు అనుగుణంగా నడిచేందుకుగాను ప్రజలమీద, ఉత్పత్తి శక్తుల మీద కఠినమైన నిబంధనలు విధించాలంటాయి. ప్రభుత్వం తన 'సంక్షేమ' రాజ్యపు ముసుగును వదిలించుకుని, ఖర్చు తగ్గించుకోవాలంటాయి. ఈ షరతుల ఫలితాలు కొత్త బడ్జెట్‌లో, వాణిజ్య, పారిశ్రామిక విధానాలలో స్పష్టంగానే ఉన్నాయి.

అయితే సామ్రాజ్యవాదం నిజానికి 'కాగితపు పులి' అని మావో చెప్పిన మాట మరొకసారి ఈ షరతులలో రుజువవుతున్నది. మానవ సృజనాత్మకతను అరికడితే తప్ప, ప్రజలు తమ అవసరాల కోసం తాము ఉత్పత్తి చేసుకోవడాన్ని అరికడితే తప్ప, ప్రజలను నల్లచట్టాల నిర్బంధాలలో బిగిస్తే తప్ప, చుక్కలనంటే

ధరలకు బలిచేస్తే తప్ప మనుగడ సాగించలేని నిస్సహాయ స్థితి సామ్రాజ్యవాదానిది. అంతపులుల్లా కనబడే ఐ.ఎం.ఎఫ్. షరతులూ, భారత ప్రభుత్వ విధానాలూ ఎంత కాగితపు పులులో ఇవాళ తెలుగుసీమలో బద్దలైన ఎరువుల గోదాములు రుజువు చేస్తున్నాయి. ఎరువుల సబ్సిడీ తగ్గించి రైతుల భారం పెంచదలిస్తే, ఎరువుల ధరలు పెంచి సామ్రాజ్యవాదానికి లాభాలుచేకూర్చి పెట్టదలిస్తే సబ్సిడీలతో, ధరలతో సంబంధంలేని ప్రజా పంపిణీ వ్యవస్థను రైతులు రూపొందించుకున్నారు. లాటిన్ అమెరికా దేశాల్లో, మధ్యప్రాచ్యంలో ఐ.ఎం.ఎఫ్. రుణాలు, షరతులకు వ్యతిరేకంగా, ఉపసంహరించుకున్న సబ్సిడీలకు వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమించినపుడు ప్రభుత్వాలు పాశవికదాడులు చేసినట్లే ఇవ్వాళ ఆంధ్రప్రదేశ్‌లో ఎరువుల గిడ్డంగుల ముందు, రహదారులకడ్డంగా ప్రదర్శనలు చేస్తున్న రైతులపై పోలీసులు కాల్పులు జరుపుతున్నారు. ఈ ఐ.ఎం.ఎఫ్. దాడుల్లో ఇప్పటికే ముగ్గురు రైతులు మరణించారు. అయితే రాజీవ్ చిరునవ్వు నోచుకోని బడ్జెట్‌లో రాజీవ్ ట్రస్టుకు కేటాయించిన వంద కోట్ల రూపాయల 'వివరణ'ను విత్తమంత్రి వెనక్కి తీసుకోక తప్పలేదు. దేశంలోని నదుల్లో కలిపిన రాజీవ్ బూడిదను తమ పొలాలకు ఎరువుగా భ్రమించడానికి భారత రైతాంగం ససేమిరా ఒప్పుకోలేదు. పాతధరలకే పాత స్టాకులన్నీ అమ్మడం, సబ్సిడీ కొనసాగించడం చేయకపోతే ప్రజలు అప్పులకు, రాయితీలకు అతీతమైన స్వాధీన పథకాన్ని అమలుచేస్తారు.

సామ్రాజ్యవాదం మరణశయ్యమీద ఉన్నదనీ, భారత ఆర్థిక సంక్షోభానికి నూతన ప్రజాస్వామిక విప్లవమే ఏకైక పరిష్కారమనీ ఇవాల్టి ఘటనలు మళ్ళీ మళ్ళీ చెపుతున్నాయి. ఒకవైపు నిర్బంధాన్ని అమలు చేసే సామ్రాజ్యవాదం ఉన్నది, దాని తొత్తులున్నారు. మరోవైపు నిర్బంధాన్ని బద్దలుగొట్టే ప్రజారాశులున్నాయి. ఒకవైపు దేశాన్ని అప్పుల్లో ముంచి తమ భోగం చూసుకునే దళారీలు, భూస్వాములు, సామ్రాజ్యవాదులు ఉన్నారు. మరోవైపు అప్పులన్నిటినీ రద్దుచేసే నూతన ప్రజాస్వామిక విప్లవం ఉన్నది. ఒకవైపు మనిషి సృజనాత్మక శక్తులను అడ్డుకునే సామ్రాజ్యవాద, దళారీ పాలకవర్గాలున్నాయి. మరోవైపు నూతన మానవుణ్ణి సృష్టించే విప్లవం ఉన్నది. ఒకవైపు ఉత్పత్తి శక్తులమీద బంధనాలు విధించే సామ్రాజ్యవాదం ఉన్నది. మరోవైపు ఉత్పత్తి శక్తులను విముక్తిచేసే నూతన ప్రజాస్వామిక విప్లవం ఉన్నది. అది ఉత్పత్తి శక్తులను మాత్రమే కాదు, సకల మానవాళినీ సమస్త బంధనాల్నుంచీ విముక్తిచేసే వర్గరహిత సమాజ దిశగా సాగుతున్నది.

3-8-91

పాట :

# తెలుగోడే రాజయ్యినాడురా ...

గద్దర్

తెలుగోదే రాజయ్యినాడురా
మన తెల్గోదె మంత్రయ్యినాడురా
ఏందెస్తడో, ఏంతేస్తడో, ఏమిస్తడో గాని ॥ తెల్గోదే ॥

తెలంగాణా పల్లోదే
కరీంనగర్ జిల్లోదే
ఢిల్లీ గద్దె ఎక్కిండు
ఢిల్లెం పల్లెం అండు ॥ తెల్గోదే ॥

పదవి ఆశ లేదంటునె
పెదవి సప్పరిచ్చిండు
అందిన పదవుల్లోన - ఏ పదవీ వదలలేదు
ముఖ్యమంత్రి, పోలీసుమంత్రి
బయటిమంత్రి, లోపటిమంత్రి
అదను దొరికిందో లేదో
ప్రధాన మంత్రయ్యిండు ॥ తెల్గోదే ॥

ఎంపీగా గెలవలేదు
నిలబడన్న చూడలేదు
మెజారిటీ రానేలేదు
తనోడె తోడులేదు
ఐనా మా తెల్గోడు ప్రధాన మంత్రయ్యిండు ॥ తెల్గోదే ॥

ఒక్క తెల్గుగాదంట
లెక్కలేని బాసలన్ని
సక్కంగ రాస్తడంట
అందుల యిదులోకి
ఇందులది అందులోకి

తారుమారు జేస్తడంట
తర్జుమాలు జేస్తడంట
ఎయ్యి పడగల పాము
అయ్యా[illegible]ంతో యిష్టమంట
బాపనయ్య నెత్తంటే
తేనె బూసిన కత్తే ॥ తెల్గోడే ॥

భూమంత పంచమని
భూలోకంకు జెప్పి
సొంతభూమి ఇంతైన
సెయిజారితె ఒట్టండు
పండ్లతోట బెంచినోల్ల
పండ్లు తెంపు కుంటమంటె
తుపాకి గుండ్లు చూపి
తరిమి తరిమి కొట్టినోడు ॥ తెల్గోడే ॥

తాబుట్టిన ఊళ్ళోన
తన చెప్పులు కుట్టినోల్లు
తన బట్టలు ఉతికినోల్లు
తన పొలం దున్నినోల్లు
తలా ఇంత పొలం దున్ని
తిండి గింజ ఎలుక్కుంటె
పోలీసు క్యాంపు బెట్టి
పొట్టు పాట్టు కొట్టినోడు ॥ తెల్గోడే ॥

కట్టుకున్న బంగులాలో
పెట్టలేదు రాత్రిబడి
ఇల్లులేని పేదోల్లకు
పంచలేదు తన జాగను
గేటుకాడ - గడపకాడ
బంగ్లనిండ బందూకులే
ఎస్పీ, డిస్పీ లకు గెస్టహౌస్, రెస్టహౌస్
రైతుకూలి సంఘపోల్ల
రక్తం రుచి జూస్తడంట ॥ తెల్గోడే ॥

తెలుగోడే రాజయ్యినాడురా



కరీంనగర్ జిల్లాలోని
పల్లె పల్లె గల్లి గల్లి
పంప్తడంట పోలీసుల
సంప్తడంట కూలోళ్ల
ఎలమదొరకు, రెడ్డిదొరకు
అండదండ గుంటడంట
నామ్‌నిషాన్ లేకుండ
నక్సలైట్ల సంప్తడంట

|| తెల్గోడే ||

పంజాబు పనిపెడ్తనని
పండ్లు కొరుకుతున్నాడు
కాశ్మీరు కత చూస్తనని
కత్తి నూరుతున్నాడు
విచ్ఛిన్న శక్తులకు
పుచ్చపడగొడ్తనండు

|| తెల్గోడే ||

దక్షినోడు మంత్రయ్యిన
ఉత్తరమోడు మంత్రయ్యిన
టాటా, బిర్ల, అంబానీల
తోలు బొమ్మలే వీళ్ళు
అమెరికా, రష్యాగాళ్ళ
ఆటబొమ్మలే వాళ్ల
దేశాన్నే అమ్ముకొనే
దేశద్రోహులు వీళ్ళే
పేదోళ్ల ఉసురుతగ్లి పేలిపాయె ఇందిరమ్మా
కూలోళ్ల ఉసురుతగ్లి రాజీవుని జీవిబాయె
ఆ తొవ్వలో బోవద్దని అందరము దీవిద్దాం
ఎనకటోళ్లు తొవ్వబోతే ఏట్ల మునిగిపోతాడు

|| తెల్గోడే ||

# కల్లోల కలల మేఘం

నారాయణస్వామి

వీరులందరినీ పగబట్టి హత్యచేస్తున్న దేశంలో
అవిశ్రాంత స్వాప్నికుడొకడు మసకబారిన అద్దం ముక్కను చేత్తోపట్టుకుని
కూలిపోయిన చెట్ల విరిగిన కొమ్మల విధ్వంస బీభత్సంలో నడుస్తున్నాడు
జీపు టైర్ల రంపపు కోతలో బూట్ల తొక్కిడిలో రక్తం మరకలమధ్య
మట్టి అడుగున దాక్కున్న పొలాలు వేలాది పచ్చటి కత్తుల ఆకులని సాచి
స్వాప్నికుని కలల నాడులని మీటినయి
నేల కొరిగిన వీరుని చేతివేళ్ళపై మొలిచిన తుపాకి జెండా ఎర్రగా
రెపరెపలాడుతోంది
స్వాప్నికుడు మోకరిల్లి కళ్ళనుండి రెండు నల్లటి మేఘాల్నితీసి ట్రిగర్ పై
నుంచాడు
వీరుని చెయ్యి భూగోళమై విప్పారి ముకుళిత సముద్రాల్ని వికసించి
అపారమైన జీవన పోరాటానుభవాల రుతుపవనాల్ని వీచింది
"ఇప్పుడీ మేఘాన్ని తిట్టుకోవద్దు; మేఘం పసిపాపల చెక్కిళ్ళ
లేలేత సౌకుమార్యం, మేఘం పక్షి ఱెక్కల సముదాయాల సుతిమెత్తని
స్పర్శ, స్పృశిస్తేనే పూలవాన కురిసే ఆకాశ వృక్షశాఖ మేఘం;
మేఘాన్ని తిట్టుకోవద్దు
దుర్భర నిర్బంధాల ఖాకీ వేడికి కరిగి కరిగి కన్నీరై ఆవిరైన జీవన క్రోధం
మేఘం
ఆయుధాల చూపులు ఆప్యాయంగా స్ఫూర్తినిచ్చి పలకరిస్తే జడివానై
కురిసి కశ్మలాన్ని సమూలంగా కడిగేసే కొత్తకాలం
మేఘం
మేఘాన్ని తిట్టుకోకు"
అంటూ వీరుని చెయ్యి స్వాప్నికుని కలల విల్లంబులని సవరించింది
ట్రిగర్ పై స్వాప్నికుని చూపు బిగుసుకుంది
జెండా మేఘాలు మేఘాలుగా అలలై కదిలింది

స్వాప్నికుడు మసకబారిన అద్దాన్ని విసిరేసి
సింహాసనాన్ని కాపుకాసే సింహాల కోరలకు బలైన
వీరుల సజీవ నేత్రాల్ని పొదుగుకుని
కొత్త చూపుతో పయనించాడు
కలలన్నీ ఇగిరిపోతున్న దేశంలో
స్వాప్నికుడు కల్లోల కలల మేఘమై రెక్కలారుస్తూ
బీళ్ళ నెర్రెల్లో వర్షించాడు

## ఉపరితలం

రిపోర్టర్

అర్ధరాత్రి
ఖాకుల దిగ్బంధంలో
రూపాయి విలువలా మారిన ఊరు
తెల్లారేసరికే సూర్యుళ్ళ సమాధి చేయాలని
ఊరి చుట్టూ తుపాకుల వల
వేటకుక్కల రాకకు
ఇక్కడ తుడుం మోగదు
శబ్దం విచ్చుకోదు
నోరు తెరిస్తే తూటా దిగుతుందని
సంకేతాలు సంచరిస్తాయి
ఊరంతా దిగులు కుంపటిపుందు
ఎవరి నీడ వాళ్ళనే వణికిస్తుంది
కళ్ళకు కునుకుండదు
తెరిచినా మూసినా ఒకటే భయం
చెంబు చేతబట్టి కదిలినా
నోరు తెరిచిన లాఠీపులి కరుస్తుంది
ఎరుపెక్కిన వాతల్ని శరీరం మోస్తుంది
తెల్లవారక ముందే

ఒక్కో ఇంటి తలుపులపై బాకుల గోల
తెరుస్తే....
తెరవడానికి
బేజారయిన అడుగులు తడబడ్తాయి
ఆలస్యానికి బాకులు కరుస్తాయి
కలోగంజో కాచుకునే
మట్టిపాత్రలు మట్టి కరుస్తాయి
వెలుతురు పంచినందుకు
బల్బులు బద్దలౌతాయి
వలువ లూడ్చినంత పన్జేసి
శీలాన్ని హాకి బండకేసి ఉతికే బూతులు
కాపాడే దిక్కుకోసం కాళ్ళమీద పడ్డా
నోటికాడి కూడుపై కిరోసిన్ రాల్తుంది

ఇల్లు
ఓటమి పాలయిన యుద్ధ భూమవుతుంది
తూటాలు పేల్తాయి
ఎక్కడ ఎందుకు ?
గుండెల్లో దిగబడ్డంత అనుభూతి
శవాల పక్కన కన్నీరు కరువౌతుంది
చితిమంటల్తో తెల్లారిన ఊరు
కన్నీళ్ళను గుడ్లల్లో కుక్కుకుంటుంది.

## ఇప్పుడు మౌనంగా ఉండం

ఎం. టి. ఖాన్

ఇప్పుడు మేం మౌనంగా ఉండం
దేహంలో ప్రాణం మిగిలి ఉన్నంత వరకు
మాటలు చురకత్తుల చిహ్నాలవుతాయి
పెదవులు బాకుల ప్రతీకలవుతాయి
కొన్ని మాటలు వెలువడడం లేదు
కాని శరీరంలో ఇంకా శ్వాసాడుతోంది

విలువలు :

## త్యాగం - ప్రతిఫలం

'యువకులను రెచ్చగొట్టి వ్యర్థత్యాగాలు చేయిస్తున్నార'ని విప్లవోద్యమ నాయకుల మీద రెండు దశాబ్దాలుగా విమర్శ వస్తూంది. తొలి రోజుల్లో సి.పి.ఐ, సి.పి.ఐ(ఎం) నాయకుల నుంచి మొదలైన ఈ విమర్శ ఇవాళ్టికీ ఏదో రూపంలో కొనసాగుతోంది.

'ఏదో ప్రతిఫలం లేకపోతే ఇన్ని కష్టాలు పడతారా' అని విప్లవకారుల గురించి అమాయకంగా అనే మధ్యతరగతి మనుషులూ, ధూర్తంగా అనే పోలీసు అధికారులూ ఉన్నారు.

త్యాగం, ప్రతిఫలం భావనల గురించి మధ్యతరగతిలో ఉన్న ఆలోచనలు చిత్రమైనవి. ప్రేమ, స్నేహం, కరుణ, అనురాగం, సంఘజీవనం వంటి మానవీయమైన విలువల నుంచి పరాయీకరణ పొందిన మధ్యతరగతి సృష్టించిన భావనలవి. సరుకుల ఆరాధనకు లోనై, అన్ని మానవ సంబంధాలనూ సరుకుల మధ్య సంబంధాలుగా, అంగళ్లలో చూసే మధ్యతరగతి సృష్టించిన భావనలివి. ఈ భావనల్లో ప్రతిఫలం లేకుండా ఎవరూ ఏ పనీ చేయరు. ఆ ప్రతిఫలం కూడ కచ్చితంగా గుర్తించదగిన రూపాల్లో, డబ్బు రూపంలోను, ఆస్తి రూపంలోనూ ఉంటుంది. ప్రతిఫలం లేని త్యాగం వృథా అయిపోయినట్టే. అసలు త్యాగం ఒక మానవ సంబంధంగా కాక ప్రతిఫలాపేక్షతో చేసే వ్యాపారంగా ఉంటుంది. ఈ భావనల్లో త్యాగాన్ని నష్టంతోనూ, ప్రతిఫలాన్ని లాభంతోనూ పోల్చడం సాధారణంగా జరుగుతూ ఉంటుంది. ఈ భావనలే ప్రచార సాధనాల ద్వారానూ, కమ్యూనిస్టులుగా పేరుపెట్టుకున్న వాళ్ళ ద్వారానూ ప్రచారంలోకి వచ్చి సాధికారతను పొందాయి.

---

మెడమీద ఉరితాడు ఇంకా బిగుసుకోలేదు
ఇంకా వ్యవధి ఉంది
ఏదయినా సరే
గొంతులో లోతులనుంచి
చీకటిని ఎదిరిస్తూ
ఒక పూర్తి కేకయినా వెలువడొచ్చుగద
ఇప్పుడిక మేం మౌనంగా ఉండలేం - ఉండలేం - ఉండలేం.

ముఖ్యంగా విప్లవోద్యమంలో, సామాజిక కృషి దేనిలోనైనా ఎంత మాత్రమూ ఉండడానికి వీలులేని వ్యర్థ త్యాగం అనే భావం వాపకింది నీటిలాగ నిబద్ధతను తొలిచేస్తోంది.

అసలు త్యాగం, ప్రతిఫలం అనే వాటిని సమాన స్థాయిలో వాడడం తప్పు. ఆ రెండింటికీ సమాన ప్రమాణాలు ఉండే అవకాశం లేదు. త్యాగం ప్రధానంగా గుణానికి సంబంధించినది. ప్రతిఫలం పరిమాణానికి సంబంధించినది. త్యాగాన్ని కూడ ఏదో పరిమాణంలో, అంకెల్లో ఎప్పుడైనా చెప్పవచ్చును గాని అప్పుడు ఆ పరిమాణం, ఆ అంకెలు కూడ ఒక మానవీయ స్పందన నుంచి, మానవీయ లక్షణం నుంచి వెలువడినవే అయి ఉంటాయి. ప్రతిఫలం కూడ గుణంలో కనబడుతుండవచ్చు గాని దానికి త్యాగం కన్న ఎక్కువగా దర్శనీయత, కొలవగలిగిన అవకాశం ఉంటాయి.

విప్లవోద్యమంలో త్యాగానికి నిర్బంధాలు, నిషేధాలు, మరణాలు వంటి పరిమాణాత్మక అర్థం చెప్పి, ప్రతిఫలాన్ని కూడ ఆ పరిమాణాత్మక అర్థంలోనే చూడదలచుకోవడం అర్థరహితం. విప్లవోద్యమంలో ఉండే త్యాగం ఒక నూతన సమాజం కోసం తపన నుంచి, ఆకాంక్ష నుంచి పెల్లుబికినది. త్యాగం కోసమే త్యాగం చెయ్యడం అనేదే అరుదు. విప్లవోద్యమంలోనయితే అటువంటి దానికి స్థానమే లేదు. రెండు వర్గాల మధ్య రాజ్యాధికారం కోసం భీకరమైన పోరాటం సాగుతున్నప్పుడు హింస-ప్రతిహింసలు ఒక తార్కిక క్రమంలోనే కొనసాగుతుంటాయి. పాలకవర్గ హింస పాలితుల జీవితాలను ఎంతగా భగ్నం చేస్తూ వచ్చిందో, వాళ్ళ ప్రతిహింసను కూడ అంతకన్న నిర్దాక్షిణ్యంగా అణచివేయడానికి ప్రయత్నిస్తుంది. ఈ ఘర్షణలో ప్రజలు పడిన అన్నిరకాల కష్టాలను త్యాగంగా గుర్తిస్తున్నాం. ఎంతమంది చెరసాలల పాలయ్యారు, ఎంత ఆస్తి నష్టమైంది, ఎంత మంది ప్రాణాలు పోగొట్టుకున్నారు అని లెక్కలు వేసి, త్యాగాన్ని ఆ అంకెల్లో అంచనా వేయలేం.

నిజానికి సామాజిక స్థాయిలో త్యాగం అనే మాటకు నిర్దిష్టమైన అర్థంలేదు. సమాజ పురోగమనానికి చోదక శక్తులలో త్యాగం ఒకటి. ఎంతమంది శ్రమజీవులు తమ నెత్తుటిని చెమటగా, పంటగా, యంత్రాలుగా, సాధనాలుగా "త్యాగం" చేస్తే సమాజం పురోగమిస్తూ ఉంటుంది! నాగరికతా చరిత్ర అంతా ఇటువంటి త్యాగాల,

ప్రతిఫలాల, పురోగమనాల చరిత్రే. అంటే వర్తమాన సమాజం భవిష్యత్ సమాజం కోసం 'త్యాగం' చేస్తూ ఉండకపోతే సమాజ చలనమే ఆగిపోతుంది. ఎన్ని మేధలు, ఎంత సృజనాత్మకత, ఎంత శ్రమశక్తి, ఎన్ని అన్వేషణలు, ఎంత సంపద అట్లా ప్రతి తరం తరువాతి తరానికి అందిస్తూ వస్తున్నదో గుర్తిస్తే సామాజిక స్థాయిలో త్యాగం-ప్రతిఫలం అనే మాటలు అర్థాలు కోల్పోతాయి.

అసలు నిజానికి స్వంత ఆస్తి భావన లేకపోతే త్యాగం, ప్రతిఫలం అనే మాటలు వాడకంలో ఉంటాయా అనేది అనుమానమే. నా వస్తువు, నా ఉద్యోగం, నా ఆస్తి, నాది అనేది ఉన్నప్పుడే అది వదులుకోవడం అనేది ఉంటుంది. ఒక స్వంత ఆస్తిని వదులుకున్నప్పుడు దానికి పరిహారంగా ప్రతిఫలం పొందాలనే భావన ఉంటుంది ('మా ఫలేషు కదాచన' అని శ్రీకృష్ణ భగవానుడు అర్జునునికే చెప్పి నప్పటికీ ఫలాపేక్ష లేకుండా చేయించిన/చేసిన యుద్ధం కాదది).

త్యాగం అనే మాటకే ఇంత విస్తృతి ఉన్నప్పుడు వ్యర్థ త్యాగం అనేది ఉంటుందా? మళ్ళీ వ్యక్తిగత స్థాయిలో చూస్తే, ఒకరు తమకు చెందినదాన్ని పోగొట్టు కుంటారు, అందుకు ప్రతిఫలాన్ని ఆశిస్తారు. అంటే వ్యక్తిగత స్థాయిలో ప్రతిఫలం లభించకపోతే త్యాగం వ్యర్థమైపోయిందని అనవచ్చు. నిజానికి ఆ రకంగా కోట్లాది శ్రమజీవుల త్యాగం, వాళ్ళు తయారుచేసిన సంపద వందల సంవత్సరాలుగా వ్యర్థమై పోతున్నాయి. సంపన్నవర్గాల ఖోషాణాల్లో చేరుతున్నాయి. కాని సామాజిక స్థాయిలో చూస్తే వర్గ సమాజం ఉన్నంతకాలం ఇట్లా త్యాగానికి "ప్రతిఫలం" ఉండకపోవడం ఉంటుంది గాని త్యాగం వ్యర్థమై పోవడం ఉండదు. సమాజంలో ఒకతరం త్యాగం చేసినదంతా సంచితంగా మరో తరానికి అందుతూనే ఉంటుంది. ఈ త్యాగఫలాన్ని పంపిణీ చేసుకోవడంలో భయంకరమైన అసమానత కొనసాగుతుంటుంది. సమాజ త్యాగఫలం సమాజానికి అందుతున్నట్టే పైకి కనిపించినా సమాజం మొత్తంగా చేసే త్యాగాలఫలం పాలకవర్గాలకు మాత్రమే అందుతుంటుంది. వర్గరహిత సమాజంలో నైతే సమాజ త్యాగం, సమాజ ఫలంగానే ఉంటుంది. అప్పుడసలు త్యాగం, ప్రతి ఫలం అనే మాటలే మారిపోతాయి.

విప్లవం అనేది వర్గరహిత సమాజ దిశగా సాగే కార్మికవర్గ విప్లవమైనప్పుడు, అది కూడ సమాజం తనకోసం తాను కంటున్న కలగా, తన కోసం తాను చేసు

కథ :

## ఊరుపిసికలు పోరుపెట్టి....

వి. భానుమూర్తి

గూటికింద కమ్మేసిన కోడిపుంజు కుక్కురూకూ అని ఉరిమినట్టు మూమ్మారు కూసింది. మాంచి నిద్దురలున్న వెంకటయ్యకు సటుక్కున తెలివైంది. అరె నీ తల్లి! తెల్లారే పామెనసుకుంట దిగ్గున మంచంల లేసి కూసున్నాడు. ఈ అలికిడికి పక్క నున్న లచ్చిమి జర ఒత్తిగిలి పక్కకు దిరిగి పడుకున్నది. రాత్తిరి సాల సేపటిదాక ఊల్లె ముచ్చట్లు ఎవుసాయం ముచ్చట్లు నడిజాము దిరిగేదాక మాట్లాడుకుంట పండు కున్నందుకయింతాలె లచ్చిమికి మెలుకువ రాలేదు. వెంకయ్య లచ్చిమి మొఖంకేసి తేరిపార జూసెటాల్లకు లచ్చిమి పెదాలు ముసిముసిగా నవ్వుతానయి.

తొలి కానుపాయెనని మూన్నెల్లు ముందుగాలనే లచ్చిమి తల్లి పోరుపెట్టి తీసుకచ్చింది. ఆమెను జూడకుంట పట్టుమని పదిరోజులన్న మనుసాగుతలేదు. వెంకయ్యకు. ఎప్పుడయినా అచ్చింతెల్లారే ఆపసు పోతనంటె లచ్చిమి సాగ నిత్తలేదు.

అయిటి నెత్తిమీదికచ్చె ఓసారి జూసిపోతె అయిటి పనిజేసుకోవచ్చునని వారం రోజుల కిందటే వెంకటయ్య అత్తగారింటికచ్చిండు. లచ్చిమి బలవంతం మీద ఈ వారం రోజులాగిండు. కాని రాత్రి గాలివానతోటి మంచిగనే పడ్డది వాన. తెల్లారే జామున పోతనని లచ్చిమిని ఒప్పించిండు. పుంజు మల్లోసారి గూసెటాల్లకు లచ్చిమి

---

చేసుకుంటున్న కృషిగా, వ్యవసాయంగా ఉంటుంది. అంటే ఇక్కడ సాగే త్యాగం శ్రామిక వర్గాలు అనంత కాలంగా చేస్తూ వస్తున్న త్యాగం కన్న గుణాత్మకంగా వేర యినది మాత్రమే కాదు, పాత త్యాగాల వ్యర్థత్వాన్ని రద్దు చేయడానికి ఉద్దేశించినది. అంటే ఇక్కడి త్యాగం మానవ శ్రమశక్తి మీద, మేధ మీద గౌరవం నుంచి, మానవజాతి భవిష్యత్తు పట్ల ఆకాంక్ష నుంచి పెల్లుబికినది. ఈ త్యాగం వ్యర్థం అయ్యే అవకాశం ఎంత మాత్రం లేదు.

[జూలై 28 మృత వీరుల సంస్మరణ సందర్భంగా]

గూడ లేచింది. భర్త తమూరును జూసి పెంట పొలాల్లకు జేరినంత పరిగడ్డి జొన్న సొప్ప తడుపకుంట ఇంట్ల అటుకు మీద పెట్టినంక మల్ల రావన్నని మాట దీసుకొని గలుమెల్లెదాక సాగదోలింది.

ఊరు దాటంగనే అన్ని తుట్టె పొటుకలున్నయి. తెల్లారెటల్లకు ఇల్లుజేరి పెంట జేరగొట్టాలన్న ఏగిరంతోటి వెంకటయ్య జెప్ప జెప్ప నడవ వట్టిండు. ఎంకటయ్యకు రెండెడ్లున్నయ్, రెండెకురాల సెలుకున్నది. పోయినేడే పాలేరు తనం జేసుడు మంచిగని పియ్యత ఓ రెండెడ్లు కొనుక్కొని తన సెలుక దున్నుకుంట రాంగోపాల్‌రావ్ దొరది ఎకురం పొలం బటాయికి దున్నుతాండు.

పోయినేడే ఊరజెరువు కిందున్న పెద్ద పెద్ద పట్టేదార్ల పొలాలను భూమి లేనోల్లంత దున్నుకుందామని జండాలు నాటిండ్లు. కాని పోలీసుల దెబ్బల, కేసుల భయానికి దున్నిన పొలాలను అట్లనే ఇడిసిపెడితే రెండు పంటలకు భూమి అట్లనే బీడే ఉన్నది. రివ్వుమని ఒక్కసారచ్చిన ఈదురుగాలికి తొవ్వ పక్కనున్న తేకు టాకుల మీన రాత్రి పడ్డ వానకు నిల్చిన నీల్లన్నీ వెంకటయ్య మీద జల్లునపడేటాల్లకు ఆలోచనలల్లున్న ఎంకటయ్య ఈ లోకంల కచ్చిండు. ఇంకో రెండు కిలోమీటర్లు నడిస్తే రోడ్డు వస్తది.

తొవ్వకు రెండు దిక్కుల గజమెత్తు గజమెత్తు తేకు మొదలున్నయ్. ఆటి పక్కపొంటి పుల్లగట్టెల తీరుగ తేకు పొటుకలు మొలిచినయ్. రెండు మూడేండ్ల కిందనయితే పెద్ద పెద్ద తేకు మాకులుండె. ఈ పల్లెల మనిషికో ఇల్లు గట్టుకున్నా ఈ తేకువనం ఒడిసేది గాదు. నాగటి కానికని సెట్టు ముట్టుకుంటె సయికోడు సావ దెబ్బలు గొట్టేది. అసోంటి సైకోల్లకేం రోగం బట్టిందోగాని దూలాలకు దూలాలు, మొట్లకు మొట్లు, లారీలకు లారీలు పట్నానికి తర్లిపోతుంటే పల్లెత్తు మాటనలేదు ఈ జంగలాతోల్లు. ఏందిట్ల గావట్టెనని ఉండబుద్దిగాక ఓసారి సైకుదారు సాబునడిగితే! ఏం జెయ్యమంటాండ్లయ్యా? సౌకరి జేస్తే బాధ. చెయ్యకుంటో బాధ. ఎం ఎక్లే సాబ్‌కు ఎడమ సెయ్యి సొంటోదట ఆ రాషపులు సేత. అని లాతి ఆపితిమా అంటే "పొటుకలన్న లేని బోడగుట్టలల్లకు తబాదల జేపిస్తమని బెదిరియ్యవట్టిరి". అని పండ్లు కొరుక్కవట్టిండు. మెల్ల మెల్లగ పేకులు వామె మొద్దులు వాయి కారు జంగలంత గంగల గలిసె. కొడిసె బొటుకలు, కారెం

గల పోరుకలు మిగిలిపాయె. ఈ పేరిన్ పొంగాకచ్చిన కాన్నించయితే పేర్నీలల్ల గాలపెట్టెతందుకు తునుకులు పొలాలన్ని పాడయిపోయె. తిందామంటె తునికి పండు పాలపండు బంగారమై పాయె. ఇట్లాలోచన జేసుకుంట పొరుకల్దాటి రొడ్డెక్కనే ఎక్కిండు ఎంకటయ్య.

పొరుకలల్లకెల్లి బయటకచ్చి తూర్పు దిక్కు దిరుగంగనే కరకర పొద్దువొడుస్తాంది. కానేపట్ల నడిసేటల్లకు దూరంగా ఎంకటయ్య ఊరి పొలాలల్ల మనుసులు అటీటు తిరుగుతాండ్రు. బీడున్నందుకు పెలులిచిన గొలిమిండ్లన్నీ ఆవోల్లంత పీకుతాండ్రు. మొగోల్లేమొ ఏందో తాళ్ళు పట్టుకొని అటీటు తిరుగుతాండ్రు. అరె నీయవ్వ! వారం రోజుల్లనే ఎంత మారిపోయిండ్రు జనాలు. ఇంత దైర్నం ఈల్ల కేడికెల్లచ్చె. ఈ దైర్నం ముందుకు ఎవరు నూరిపోసిరి! ఇసిత్ర పోయిండెంకటయ్య. ఆగ బుద్దిగాలె. కాల్లేపిండు మంది దగ్గరి కచ్చినంక ఆగిండు. జంగాలు నాటినప్పటోల్లెవ్వరు లేరు. ఓహో! ఆనాడు దైర్నం జేసి రాకపోయినా ఇప్పటికైన దైర్నం దెచ్చుకొని అచ్చినందుకు సంబురపడ్డడు.

"ఏమోయ్ లచ్చులు బావా? ఇప్పటికన్నా దైర్నమచ్చిందా?" లచ్చులు సప్పుడు చేయలేదు.

"ఏందో బాల్తాతా? అందరు గల్సి దున్నుకుసుదేనాయే. కౌల్సుదెందుకో?" అంటే అయిన గూడ సప్పుడు జెయ్యలేదు.

"ఏందుక్రక! మీకేం రోకమచ్చిందంటే" గూడా ఎవ్వల్చప్పుడు జేస్తలేరు. దూరంగ నడింగెట్టు మీన దూపకు సల్లంబలి నెత్తిబున్న అంచెల పెట్టుకోని ఇటు దిక్కే జూసుకుంట మెల్లెమెల్లెగ నడుస్తున్న గొల్లోల్ల కొమురక్క కనిపిచ్చింది.

"ఏంది కొమురక్కా ? నేనడుగుతే ఈల్లొక్కమాట గూడ జెప్తలేరు ? పెద్దోల్ల భూములు దున్నే దైర్ణం ఈల్లకెట్లచ్చింది".?

"తమ్మి అదంతోకథ. మందకాడ మీ బాపున్నడు అయినయితే నీకన్నిఇద్దుబద్దుల కమానంగ జెప్తడు. పోదాం రమ్మ"ని పిల్చింది.

కొమురక్కెనుక ఎంకటయ్య నడుసుకుంటత్తాంటే అంత దూరంల నుంచి

జూసిన పర్వతాలు "ఏందోయి పిలగ! కొత్త కోడలు తీరుగనేమొ మీ అక్క కొంగు సాటున అంగంగి అత్తానవ్ ?" అన్నడు.

"అపుమరి నువ్వంటె భయపడె. మొన్నపూసనాడు కోండ్రిగాళ్ళ రెండు గొర్రె బొక్కల నిగ్గుకోని పోతాంటె దుడ్డు గర్రందుకోని ఘామ్మన గొట్టుకుంట సావు సావ్‌మని లబ్బ లబ్బ మొత్తుకుంటివి. గంత ధైర్నవంతునివై తివి మరి. ఇక నీకు భయపడకుంటె ఎట్లయితది గని."

"మంచిగన్నవు తమ్మి. ఆ ఔంబడివడితె ఉడుకుడుకు పానాలతోటన్న జీవాలు దొరికేటియిగదా అని నేనంటె అయ్యేట్ల బతుకాన్నే మరని నాకే సమాధానం జెప్పవట్టె".

"సరెగని మీ అక్కా తమ్ముడు గలిసి నన్నాడి పోసుకునుడేనా లేక కడుపుల కింతేమన్న ఇచ్చుడు గిట్ల ఉన్నదా లేదా"? పర్వతాలు.

"తమ్మీ నువ్ గూడ మొకం గడుక్కో బుక్కెడంత దూపకు దాగేవ్" అను కుంట రెండు దుత్తల్ల సిక్కటి సల్ల గలిపిన అంబలివోసి అంచుకు సింతసిగురు తొక్కువెట్టింది.

గట్టిగ రెండు బుక్కలు మింగి సింతసిగురు తొక్కు నాలికకు రాసి సప్ప రించుకుంట "ఏందోయ్ పిలగ ఎటువోతపేనా ? ఇక్కడ రాజ్జాలకు రాజ్జాలే మారి పోతానయ్." అని పర్వతాలన్నడు.

"అదే బావ నేనడుగుదామనుకుంటాన. ఆ మాతంగి లచ్చులు గిట్ట మనం జండాలు వాతి దున్నిన్నాడు రాకనేపాయిరి. ఇప్పుడేమో ఆల్లంత గొలిమిర్లేరుకుంట దున్నెతందుకు తయారై తాండ్రేంది"?

"ఏం జెప్పమంటవోయ్ గద్దెల మీద గూసుండెటోల్లు ఆల్లకు పాయిదయె టట్టుగ కానుండ్లు జేసుకుంటరు".

"అసలు జరిగిందేదో జరజెప్పు. నసపెట్టి నానపెట్టి సంపకు"

"ఆ మల్‌రెడ్డి పొలాలైనా ఆ బుచ్చిపంతులు పొలాలైనా మనోల్ల దగ్గర తప్పేటి సోటి బాకి కింద గుంజుకున్నయేనామె. ఆల్లయ్యేలు పోడుగొట్టిరా ? ఆల్ల

వ్వాలు అంబళ్లుమోసిరా? నలుబయేండ్ల నుంచి దున్నుకోవట్టిరి. ఆల్లబాకి ఎప్పుడో దేశిపాయెనని మనమ్ మనం దున్నుకుందామని అనుకుంటిమా ? ఆ భూములెవ్వాలు గొనక బయాయికెవ్వాలు దున్నిన చేతికి రెండు పంటలు రాకపాయెటాలకు ఈ పెద్ద తలకాయలన్నీ పట్నం జేరినయ్. వాళ్ళ ఎం. ఎల్లేలతోటి ఇసారం జేసుకున్నయ్. మునుపు పజలంత భూములకొసం కొట్లాడెటట్లు ఉన్నరని భూమి సీలంగని పెట్టు కొని ఓమ పండని, తొండలు గుడ్లుపెట్టే భూములకు వేయిలకెయిలకు అమ్ముకున్న సంగతి మతిలోకి దెచ్చుకున్నరు. ఇప్పుడిగ ఈల్ల భూములను సర్కారె గొనాలె. ఖజానాల నుంచి జనం సొమ్ము ఈల్ల జేబులల్ల నింపాలెనని ఉపాయం జేసిండ్లు".

"ఆల్లట్ల సోంచాయించంగనే అయిపాయెనా ? మనముత్తగనే సేతులు ముడుచుకోనుందమా బావ నువ్వు గూడ గట్లనే అంటవు".

"మనం ఊకుండమని వాల్లకెరుకెనోయ్. అందుకే మన సేతులు, నోళ్ళ కట్టేటట్టుగ కానూండ్లు జేసింద్రు".

"ఏం కానున్లట? అల్లకోసం జేసుకున్న కానూన్లతోటి మనకేంపని?"

"గట్ల పూర్తిగ కొట్టి పారేయకు. అల్లు ఎట్ల జేసింద్రో జర ఇను. అర్జనుల కోసం ఏందో కార్పొరేషన్ ఉందట గద ? ఇంతకు ముందైతే అల్ల పైసలతోటి అల్లకు కోల్లకు, గొర్లకు అప్పులిచ్చేదట? ఇప్పుడేమో అల్లకోసం దీసిన నూరుకోట్ల రూపాయల తోటి దొరల భూములు గొని సగం ధరకు అర్జనులకిత్తరట".

"అర్జనుల దగ్గర పైసలెక్కడున్నయ్ ? అసలు అట్టిగనే ఇడిసి పెట్టవలసిన ఈ భూములకు ధరెవ్వడు నిర్ణయం జేసిండు"?

"మొన్న నాల్రోజుల కిందట నువ్వు లెవ్వు ? అర్జన కార్పొరేషనోడట ఒకడు జీబులచ్చిండు. మల్రెడ్డింటికాడ అంబ్లేసిండ్లు. ఆడు దావత్ దిన్నంక కొంత మందిని జమేసి ఇక్కడ భూములకేమి రేటున్నదని అడిగిండు. మల్రెడ్డి పటేలు మనుసులే అంత సుట్టు జేరి రెండువేలన్న జెయ్యని సేను సెలుకలకు పది వేలన్నరు. పదివేలు జేసే పొలా లన్నింటికీ నలుభై వేలన్నరు. గట్ల ధర జేసిండ్లు. ఆ లెక్కన ఈ పట్టెదార్లకు సర్కారు పైసలిత్తదట. ఆ భూమినేమొ అర్జనోల్లకు పంచుతరట".

"ఎంతన్యాయం బావ ఇది. మన ఊళ్లె రెండువేలన్న జేయని భూమికి పది వేలు, పదివేల్న పొలానికి నలబై వేల చొప్పున పజల సొమ్మును ఈ పట్టెదార్లు అప్పనంగ దింటాంటె మనం ఊకుండుదే నంటవా మరి ?"

"అప్పుడే ఎందుకేగిర పడుతున్నావోయ్ పిలగ సూద్దాం ఎట్లుంటదోమరి". ఇప్పటికైతే ఒక్కనాడన్న పొలె వట్టని ఈ పట్టేదార్లంత పొలేర్ల కట్టంతోటి పొట్టల్ నింపుకునేటోళ్లేగద. అసోంటిది ఇప్పుడిగ మన పల్లెల్నిడిసి పట్నాలకు వొయ్యేటందుకైతె తయారైనట్టుగ ఈ భూషులెవ్వారం జెప్తాందిగద. ఇగ మనం జూసేదల్ల పజల సొమ్ము పట్టేదార్ల జేబులల్లకు వోకుంట జూడాలె గంతె. ఆ పెం కదే లిరిగి పడుతదిగ".

"అయిందానికి బావ ! ఆ సంగతి పెద్ద పుచ్చపేం గాదు. మాపటీలి ఆ మాతంగోల్ల వాడల గూసుండి అంత మాట్లాడుకుందాం".

అప్పటికే మంద లేసే ఏల్లయ్యింది. ఎంకటయ్యలేసి ఇంటి మొకం పట్టిండు. పర్వతాలు గొర్ల మందను లేపుకొని పొరుక లల్లకు వోయిండు.

× × ×

పొద్దుపొడ్వ తీరుగ తెల్లగెన్నీల గాత్తాంది. ఎంకటయ్య, పర్వతాలు ఇంటింటికి దిరిగి జెప్పచ్చిండ్లు గనక బువ్వదినోళ్లెల్లొక్కలొక్కలు గాంధిబొమ్మకాడికి జమైతాండ్లు.

"అందరచ్చినట్లేనా బాల్తాతా?" అన్నడు ఎంకటయ్య

"అతుకూరోల్లాడల పెద్దమనిషి రానట్టున్నది".

"అగగో దగ్గుకుంటచ్చెటాయన మల్లేసేపటు" అన్నరు మందిలనుంచి.

సరాయించుకొని ఎంకటయ్య మాట్లాడబోయిండు.

"ఏందే ఎంకటన్నా ? సర్కారోల్లు అరిజనల్లకేమన్న మంచిపని జేత్తాండ్లంటే అండ్ల అన్ని తప్పులే తీత్తవ్ నువ్వు. వెనుకటెప్పుడో ఇందిరమ్మ రాజబరణాలనేటి యేంటియో రద్దుచేసి సైన కక్కరేకు రాని బిరుదులన్నింటికి కోట్ల డబ్బిచ్చి గొన్నదని అల్లు పెద్ద పెద్ద కార్కానాలు వెట్టుకునేందుకు పజల సొమ్మంత అనాటి రాజు

లకు దొబ్బపెట్టిందంటివి. మొన్నటికి మొన్న సీలింగులనిపెట్టి అక్కెరకు రాని కప్పల్, తొండల్ గుడ్లు పెట్టె దొరల భూములకు సీయిలకెయిలు పజల సొమ్మే ఇచ్చిందంటివి. ఆ అక్కెరకు రాని బీడు భూములన్నీ మన మెడకు వెడితే పంటలు వండక మనం జత్తాన మంటివి. మరి ఇప్పుడిగేందే బంగారమసొంటి దొరల భూములను సర్కారే గొని సగం దరకే మనకియ్యవట్టె. ఇంతకంటె ఎక్కువ సర్కారేంజేత్తది జెప్పే"? తన మనసులున్నదంతెల్లగక్కిండు మాతంగి లచ్చులు.

ఎంకటయ్య ముసిముసినవ్వు నవ్వుకుంట 'మీదికి జూసెటందుకు సర్కారు పనులన్నీ మంచిగ సాఫీగనే గనిపిత్తయ్. కాని సూడు లచ్చులు బావా! దొరల భూములు జనం గుంజుకోవట్టిరి. కాకపోతే దొరలనే నాగలివట్టి దున్నుకోంద్రి, మన మెవ్వలం దున్నద్దని కట్టుబెట్టవడితిమి. అనికేమో కట్టంజెయ్య సేతగాదాయె. ఇన్నేండ్లు బంగారం పండిన భూములు జనం పాలుగావట్టె. కుడిదివడ్డెలుక తీరుగ తండ్లాడిన ఈ పట్టెదొర్లంత, అల్లెమ్మెల్లేలకు జెప్పుకోని ఇసోంటి కానూన్ జేసుకున్నరు. రూపాయి మాల్‌ను నాల్గురూపాయలకు సర్కారుగొని సగం ధరకు రెండు రూపాయలకంటె డబల్ ధరకు మనకమ్మినచే, మనూల్లె పదివేలకెకురం పొలం దొరుకుతది గదా? ఆడు 40 వేలకొక్కని మనలను ఇరవైఏలు కట్టుండ్లనవట్టె. ఇదీ పట్టెదారుకు లాబంగున్నదా మనకా? జర ఇసారం జయ్యుండ్లి".

"ఈ ఎంకటన్న జెప్పేటియన్నీ గిట్లనే ఉంటయి. ఓ పర్వతాలన్న ఇగో ఇటు జూడె. మొన్న మల్‌రెడ్డి పటేల్ తోటి నేను గీముచ్చటే అన్న. ఎకర 10వేల భూమికి మేమిరువై వేలెట్ల గట్టుడంటె "అరె మీరే అప్పు గట్టింద్రు గనుక ఈ అప్పు గట్టవడుతదిరా" అన్నడు. "సర్కారు గట్లనే అంటది కట్టాన్నని. మీరు గట్టుకుంటే మిమ్ములనేం జేత్తది. అడిగి అడిగి అదే మాపి జేత్తది" అనన్నడు. సర్కారెంత ధరంటె మనకేంది? మనం గత్తాన్నమా ఏమన్ననా?" అన్నడు మాతంగి లచ్చులు.

"ఇంతకు ముందంటె మనదగ్గర జప్తుజేసెటందుకేం లేకుండె. ఇప్పుడట్ల గాదు. ఈ భూమి, పంటపండే భూమి మనదగ్గరున్నది. పంట పంటకు మనం కిస్తు గట్టకుంటె కట్టపడి పండించిన పంటంత ఆడే ఎత్తుకుపోతడు. కాదంటె భూమి దున్ననియ్యనంటడు. భూమ్మీద ఈసునం కొద్ది మనం కట్టుటే అయితది. ఇంతకు ముందంటే ఆ దొరోన్ని బతిమిలాడో బామాలో అటెంక పంటమీదిత్తమంటె

ఊకునెటోడు. కాని ఇప్పుడిగ సర్కారే మనకో పెద్దదొరోడు. 26 వేలప్పు పదేండ్ల మీద 40 వేలైతది అడ్డీతోటి. అయిదేరిపెటందుకు మనమే గాదు మన పోరగాండ్లు గూడ ఎనుకటి తీరుగ దొరల సర్కారుకు ఎట్టిజెయ్యక తప్పది" అన్నడు పర్వతాలు.

"ఓ అన్నో నీ బాంచెను! గింత కుటిలబాజి ఉపాయమానె? ఇప్పటిదాక మనమే జచ్చినమంటె ఇగ రేపటినుంచి మన పోరగాండ్లను కూడ జంపుకునుడేనా? అద్దద్దు ఈ ఉరిలె మనం పడద్దు. గందుకేనా మల్‌రెడ్డి పటేలు మా యింటికచ్చి మంచి గుంటదె బిడ్డ మీరు సరెనని సంతకం బెట్టుండ్రి బంగార మసొంటి పొలం మీకే అయితన్నది? ఈని పీనుగెల్ల. గందికే మంచిగ బుదురకిచ్చుకుంటచ్చిండు. అరిజను లంటె ఉత్త అమాయకపు ముండకొడుకులు. పసులసొంటోల్లు సొప్పకట్టేత్తె దింటరు. మట్టుగట్టేత్తె ఉంటరు. అనుకుంటాండ్లు. ఆ కాలం బోయింది. ఈని పొలాలద్దు గిలాలద్దు మనకు" అని మాతంగి లచ్చులు భార్య సమ్మక్కన్నది.

జనం మాటలు గుసగుసల స్థాయినుండి చర్చించుకోవడం వరకూ ఆ తర్వాత పట్టెదార్ల మోసాల్ని తిప్పికొట్టాలె అనే మాటలు వినిపించసాగినయ్.

అప్పుడు పర్వతాలు అందరు ఇనేటట్లుగ గాంధిబొమ్మ గద్దెమీద నిలబడి "సూడుండ్లి అక్కలాల, అన్నలార. పట్టెదార్లంత తమ పట్టాలు ఇడిసిపెట్టెతం దుకు తయారైండ్లు. మునుపంటె మనం దున్నుకుంటమంటె అల్లు అడ్డమచ్చేటోల్లు. ఇప్పుడైతే ఇగ అల్లు అడ్డమచ్చే ముచ్చటలేదు. మనండ్ల మనం ఎవ్వలం గూడ ముందటి కచ్చి ఈ భూమి మాకియ్యండ్లని సంతకం బెట్టద్దు. మనందరం కల్సి దున్నుకుందామ్. ఎవ్వలడ్డ మచ్చినా ఊకునేది లేదు. పజల సొమ్ముతోటి పట్టెదార్ల భూములుగొనే అవసరం లేదని అందరికి తెలిసేటట్టుగ ఊరు వాడ జెప్పుకుంట సంతకాల్జేసి పట్టెదార్ల భూములు సంతానికెవ్వలు దీసుకోవద్దని మనోల్ల కందరికి జెప్పుదాం" అన్నడు.

ఇంతల బాల్తాత లేని ఓపిక దెచ్చుకొని "సూడుండ్రోయ్ పిల్లగాండ్లు పదుసో పెదుసో అని ఏందేందో జెప్తాండ్రు. ఎట్లైతేందిగని దొరల భూములు మనకిచ్చుడే గొప్ప. మనండ్ల కెవ్వలకిచ్చినా ఒక్కటే గదా? ఎవలకో ఒగలకు లాభమైతాంది.

దీంట్లె మల్ల అందరం దున్నుకుందామంటె ఎట్ల? సర్కారు దగ్గర దీసుకునేటోల్లకు నష్టంగదా?" అన్నడు.

"సూడు బాల్తాత సర్కారోని సంగతే గిట్లుంటది. మనండ్ల మనకు లడాయి పెట్టి తన్నుకుంటాంటె తమాష జూత్తది. దొరోని దగ్గర్నుంచి మనం భూములు గుంజుకుంటున్నామన్న సంగతి దెల్వంగనే ఇగ లాభంలేదని మనండ్ల నుంచి ఒక్కలిద్దరిని తన మందల గలుపుకుందామని సూత్తాండ్లు. అందరికి చెందాల్సిన భూమిని అధికారులకు లంచం బెట్టి పజల సొమ్ము ఆడుదిని మనల్ని మోసం జేత్తాంటె మన మెట్ల ఊకుంటం. అందరమైతే రేపు నాగండ్లు గట్టుకొనత్తం. అప్పుడు దొరోనం తుకు మీరద్దన్నా ఎవ్వలాగరు. అప్పుడిగ మనండ్ల మనం కొట్లాడుకుంటె దొరో నంతుకు మనోల్లమీదీగ మనమే కేసులు పెట్టుకొనుడైతది. ఆ కేసుల్తోటి మీరు మేము తిరుగలేక సావాలె. ఊల్లె పేదోలైతే ఊకునేటట్లు లేరు" అన్నడు ఎంకటయ్య.

సాలసేపట్నుంచి అరుగుమీద కూసోని ఇదంత ఇనుకుంటున్నడు మారుపాక రామన్న. అష్టల్లుండుకుంట పెద్దసదువులకని పట్నంల ఉండెటాయన శాతీల్లని మొన్ననే ఇంటికచ్చిండు.

సరాయించుకొని రామన్న ఉన్నకాడనే లేచి నిలబడ్డడు. ఆయనేదో చెప్పె టట్టున్నడని అందరు ఆయన దిక్కే జూడవట్టిండ్రు.

"ఇగో వెంకటన్నా, బాల్తాతా! అప్పట్నుంచి నేనంతా వివరంగా వింటూనే ఉన్న. సర్కారు ఎప్పుడైనా తన వర్గానికి సేవ చేసేటందుకే ఉంది. ఈ భూముల వ్యవహారం ఇప్పుడు వచ్చింది కాని ఇంతకు ముందే దివాలా దీసిన పెట్టుబడిదార్లకు ప్రజల సొమ్ము కోట్లాది రూపాయలు కట్టబెట్టింది. ఖాయిలాపడ్డ పరిశ్రమలను ఆదుకొని వీధిన పడనున్న కార్మికులకు ఉపాధి పోకుండా జూస్తున్నానని చెప్పి నష్ట పోయిన పెట్టుబడిదార్లకు ఏటా ఇదేవిధంగా ప్రజల డబ్బు ఇస్తూనే ఉన్నది. అంతెం దుకు మొన్నటికి మొన్న ఇందిరమ్మ కొడుకు పెట్టిన మారుతీ కంపెనీకి వందకోట్ల రూపాయలు ఉత్పన్యానికి ఇచ్చి రాయితీ అంటె ప్రతిపక్షాలు గగ్గోలు పెట్టలేదా? ఇగో అన్నా! ఈ పత్రికల రాసి ఉంది. వి. పి. సింగు సర్కారుల ఒక్కొక్క కేంద్రమంత్రికి సాలీన 38 లక్షల రూపాయలు ఖర్చయిందట. అంటే వాడు నెలకు

మూడు లక్షల రూపాయల ప్రజల సొమ్ము తింటున్నాడు. నోరున్న పెద్దోల్లు ఇన్నా నువ్వు లక్షలు దింటున్నావు. మా కంపెనీలకు లాభాలు వస్తలేవు. మా సంగతేందని ప్రశ్నించినపుడు వాళ్ళ అయిషత్ పకారంగా వాళ్ళకు తినపెడుతున్నడు. వాలకుంటే పన్ను లేస్తున్నడు. ఇప్పుడు గ్రామాలల్ల దొరల భూములు పాడువడుతున్నయ్. వాళ్ళకు భూములపై రావాల్సిన లాభాలు రావడంలేదు. అందుకని వాళ్ళు నష్టపరిహారం ఇప్పించండని వాళ్ళ ప్రతినిధులను అడిగిండ్రు. అందుకని ఎస్. సి. కార్పొరేషన్ పేరుతోని దొరల భూములు •గొనిపిస్తున్నారు. బాండు కాగితాలమీద సంతకాలు పెట్టించుకొని మనకిస్తున్నరు, రేపు పంట పండినంక మనం కట్టకుంటె జప్తుచేసైనా తీసుకుపోతరు. లేకుంటే పన్నులమీద పన్నులేసి మన పేదోల్లకు బతుకే భారం చేస్తరు. అందుకని మీరంతా వెంకటన్న మాట ప్రకారము అందరు కల్సి భూమిః దున్నుకునుడే సరియైన పద్ధతి" అన్నాడు.

రామన్న మాటమీద అందరికీ గురి. అందుకని పోలోమని అందరు నాగండ్లు కట్టి జండాలు పాతిన భూములల్ల కొండ్రలేసి సయ్ సయ్మని దున్న వట్టిండ్రు.

అలిశమై పామెనని గొల్లోల్ల కొమురన్న, తమ్ముడు రామలింగు నాగలి దించి మేడిగట్ట వట్టిండు.

ఎంకటయ్య నవ్వుకుంట "ఏమోయ్ బామ్మర్ది బాగ అలిశం జేత్తివి? నీ ఆకలి పాడుగాను పగటేల్లదాకా దిన్నా తీరలేదానోయ్"?

"అదిగాదు బావ నేను కోడారేసుకొని అత్తాంటె పుట్టగడ్డమీన ఊరపిసుక లన్నీ పిసపిస మనుకుంట గాయి జేత్తాంటే గోరెంకలు కేర్ కేర్ మనుకుంట ఏదో పామును తంతాన్నట్టనిపిత్తే అటువోయిన, చూసెటాళ్ళకేమున్నది మా సూర్ల గూడు పెట్టుకున్న ఊరి పిసుకల గుడ్లు దిన్నపాము. మొన్న రాత్రి మా కోడి పొరగాండ్లను గూడా అదే ఊదేసింది. అయితె మానెగని ఊరు పిసికలు అసలుపని చేసినయని ముల్లుకట్టె ముర్రేసి నాలుగేసిన. దెబ్బకు జచ్చింది పాము" అన్నడు రామలింగు.

"మంచిపనే జేసినవుగని. ఇగ జర జపజప వోనియ్. పొద్దుగూకెటల్లకు దున్నుడు గావన్న"ని తన నాగలిని ముందుకు కదిలిచ్చిండు ఎంకటయ్య.

సీరియల్ నవల :

# రాగో

## సాధన

(గత సంచిక తరువాయి)

## 6

రోజులు గడుస్తున్నాయి. చూస్తుండగానే వర్షాకాలం రానేవచ్చింది.

ఓ రోజు రాత్రి చిమ్మచీకటి. కళ్ళు పొడుచుకు చూస్తున్నా ముందు నడుస్తున్న మనిషి ఎంత దూరంలో ఉన్నాడో కూడ తెలవడం లేదు. ముందు నడిచేవారు ఆగితే వెనుకవారు మీద పడి గుద్దుకుంటున్నారు. ముందుండే పైలట్స్ అద్దానికి చేయి అడ్డం పెట్టి టార్చిలైటు వేస్తే చిమ్మచీకట్లో అకస్మాత్తుగా కనపడే వెలుతురుకు కళ్ళు చిట్లించుకుంటూ వెనుక వారంతా గాభరాగా ముందువారి అడుగులో అడుగు లేస్తూ అతి దగ్గరగా రావడానికి ప్రయత్నిస్తున్నారు. దారిలో గుంతలు, బొందలుంటే అందులో కాలు దిగబడే వరకు తెలియనే తెలియదు. ఖర్మకాలి ఆ గుంత మరీ పెద్దదైతే అందులో పడి పళ్ళు విరిగినా విరుగుతాయి. ఒక్కోసారి కొన్ని పొక్కల్లో మొలబంటి దిగబడిపోయి డ్రెస్సు తడిసిపోతుంది. అందులో కొత్తవారైతే ఏడుపే తరువాయి. బండలు, మొద్దులా తలిగినా, కొయ్యకుచ్చినా, గుంతలు, బొందలు ఎదురైనా ముందు వారు కనీసం చెప్పరేమని ఉక్రోషం వస్తుంది. వారికి కూడ తగిలితే ఎందుకు చెప్పరనే ఆలోచన కూడ తట్టదు ఆ బాధలో. మన వాళ్ళు వినాయకుని బొడ్లో వేలు పెట్టిన చందంగా ఎన్నడూ చేయరనే ఆలోచన కూడ ఆ వేళకురాదు.

దళంలో నడుస్తున్న జైనికి అంతా గందర గోళంగాఉంది. తాను అడవిలోనే పుట్టి పెరిగింది. పద్దెనిమిదేళ్ళయి అడవిలోనే మెసుల్తుంది అయినా యింత చీకటి రాత్రి అడవిలో, వర్షంలో రేఖ (నెత్తిపై పెట్టుకునే ఆకుల గొడుగు) లేకుండా నడవడం తనకు కొత్తే. చీకట్లో ఓ అగ్గికారోయి కూడ లేకుండా నడిచే అలవాటు ఆదివాసీలకు లేదు. దానికి తోడు భుజానికి తుపాకి, జబ్బలకి కిట్లు అవిగాక తల మించి మోకాళ్ళ వరకు విరిచి కట్టినట్టు యూ మేన్‌కపేడా (వరకు) ఉండగా జైనికి

సరిగా అడుగు పడడం లేదు. ఈ కష్టాలన్నీ ఉంటాయని మొదటి రోజే గిరిజక్క-కమాండర్ చెప్పినా అందరికి లేని ఇబ్బంది నాకేముంది అనుకుంది తప్ప ఆనాడు అర్థం కాలేదు.

ఆలోచనలో పడ్డ జైనికి తోవపై ధ్యాస తప్పింది. పిరం (పొలం కట్ట)పై అందరూ ఒకరి వెనుకొకరు చాలా జాగ్రత్తగా అడుగులో అడుగువేస్తూ నడుస్తున్నారు. ఏ కాస్తా పట్టు తప్పినా, ఎత్తయిన మడి కట్టపై నుండి కింద బురదలో కూరుకుపోవడమే. సప్పున కాలు జారే వరకు జైనికి తెలియనే లేదు. దబ్బున పడ్డ జైని మోకాళ్ళ లోతుకు బురదలో దిగబడిపోయింది. పడిన చప్పుడు విన్న వెనుక, ముందు పైలట్స్ ఒకేసారి తమ చేతి లైట్లు వెలిగించేసరికి జైనిలో తెలియకుండానే సిగ్గు, బాధ, ఏడుపు ముంచుకొచ్చేయి. అందరూ నవ్వేసరికి మరీ కుంచించుకుపోయింది. ముందు నడుస్తున్న రుషి లైటు వెలిగించి "ఎక్కడ ఆలోచించినవు బాయి" అని పలకరించే సరికి తల ఎత్తుకో లేనంత తప్పు చేసినట్టనిపించింది. "మనందరికి ఇది మామూలే" అంటు గిరిజ చేయి అందించి గట్టుమీదికి గుంజింది.

ఒక్కసారి గొల్లుమన్న దళంలో వెంటనే సానుభూతి మొదలైంది. ఆప్యాయంగా పరామర్శిస్తూ తలోమాట అంటున్నారు. వారి అనుభవాలు చెప్పుకొస్తున్నారు. తేరుకున్న జైని అందరితో పాటుగా మళ్ళీ నడక ప్రారంభించింది.

దళం ప్రవర్తన జైనికి వింతగా తోస్తుంది. దళంలో ఉన్న పన్నెండు మంది ఎప్పుడూ ఆనందంగానే ఉంటారు. ఎవరిలో ఏ కల్మషమూ కనపడదు. ఎవరు ఎక్కడి వారో, ఎవరి భాష ఏమిటో, ఈ దళంలోకి ఎవరెవరు ఎలా వచ్చారో తెలియదు. కానీ అందరూ ఆప్యాయంగా కలిసి మెలిసి ఉంటారు. కల్లాకపటం లేకుండా మనసులోని మాట బయటకే అనేస్తారు. పొరపాటయితే వెంటనే సర్దుకుంటారు. ఏ క్షణంలో ఏమవుతుందో తెలియదు. ముంచుకవచ్చి ప్రమాదం ఎప్పుడూ పొంచే వుంటుంది. చావు ఎప్పుడో, ఎలా ఎదురవుతుందో తెలియదు. ఏదైనా సరే తెలియ రాకుండా అకస్మాత్తుగా జరిగిపోతుంది. ఏమొచ్చినా దళం ఎదుర్కోక తప్పదు.

అందుకే కావచ్చు అన్నలు ఏ బాధలు పట్టనట్టు ప్రతి క్షణమూ ఖులాసాగా నవ్వుతూ నవ్విస్తూ గడుపుతారు అనుకుంటూ నడుస్తుంది శైని.

దళం ఆగింది. కలియచూస్తే ఫర్లాంగు పెట్టులో పొలంలో ఖేతుల్ కన పడింది. 'దూరపు కొండలు నునుపు' దగ్గరికి వెళ్ళి చూస్తే గాని ఏ ఖేతుల్ అవ తారం అయినా అర్థం గాదు. కొన్నిట్లో సూర్య చంద్రులు కాపురం చేస్తుంటారు. అక్కడక్కడ కొన్ని పకడ్బందీగా ఇల్లు లెక్కనే ఉంటాయి. గడ్డి దొరకడం ఇబ్బంది అవుతున్న కొద్దీ చాలా ఖేతుల్లు కప్పకుండానే వదిలేస్తున్నారు. ఆర్థికంగా ఉన్న వారి ఖేతుల్లకు లేదా మాట చెల్లుబడి అయ్యేవారికి సర్కారీ వారి ప్రాపకంతో బెంగుళూరు పెంకలు అమరుతున్నాయి. దళంలో కొందరు వీటికి 'శరణార్థి శిబిరాలు' అని ముద్దు పేరు పెట్టారు. అకాల వర్షాల్లో ఆదుకుంటాయి కదా!

దగ్గరగా పోయి ఆ ఖేతుల్ హాలత్ చూస్తే బాగుండునని ఉంది శైనికి. కానీ కమాండర్ పదే పదే చెప్పే మాటలు గుర్తొచ్చి ఆ ఆలోచనను పక్కకు నెట్టేసాయి. "మన కోసం వెతికే వాళ్ళు ముందు ఊళ్ళో అడిగి వెంటనే ఖేతుల్ మీదే పడతారు. ఖేటి అయితే (తారసపడితే) ప్రమాదం కోరి తెచ్చుకున్నట్టే. సెంట్రీ అలర్ట్‌గా లేకపోతే తప్పుకోవడానికి కూడా అవకాశం దొరుకక గూళ్ళో కోళ్ళను కప్పినట్టు అవుతుంది మన పని. ఇవాళ ఖేతుల్‌కి అలవాటుపడితే రేపు? ఇప్పటికే పోలీసులు ఇళ్ళు, ఊళ్లు, ఖేతుల్లు, పంట పొలాలు ధ్వంసం చేస్తూ, సొట్లు సోదిస్తున్నారని తూర్పు వార్తలు వింటున్నాం కదా! ఒకరి అనుభవాలు మనకు గుణ పాఠం కావాలి. రేపటి గడ్డు రోజులు ఎదుర్కోవడానికి ఇవాల్టి నుండి మనం సిద్ధం గావాలి" అంటు కమాండర్ పదే పదే గుర్తుచేసే విషయాలు తేలిగ్గా తీసేయడానికి వీలులేదు. అందుకే దళంలో 'శరణార్థి శిబిరం' వైపు దృష్టి పోనివ్వరు.

రెండు రోజులుగా ముసురు టి. బి. పేషంటు దగ్గులా సతాయిస్తుంది. విడవ కుండా తుంపర్లు, మధ్య మధ్య కాస్త జోరుగా జల్లులా వస్తూ పోతున్నయి. దళం ఆగగానే రెండు కర్రలు ఎత్తుగా పేర్చి వాటిపై కిట్లు సదరుతున్నాడు టుగ్గె. వర్షం అధికం అయినా కిట్లు తడవకుండా ఏర్పాట్లు చేస్తున్నాడు. ఆ సదిరిన కిట్లపై, తన కిట్టులో నుండి పెద్ద మేన్‌కప్‌డా (వరకు) తీసి కప్పాడు. గాలికి లేవకుండా దానిపై

నాలుగు బండలు, కర్రలు బరువు కూడ పెట్టాడు. మిగతా వారందరూ ఎత్తు పల్లాలు చూసి ఎవరి స్థలం వారు సెట్ చేసుకుంటున్నారు. ఓపికున్నవారు నాలుగు కొమ్మలు విరిచి, వీపు కిందేసుకోని ఏ పరిస్థితిలోనూ తడవకుండా బందోబస్తు చేసుకున్నారు. తెల్లారి లేసి ఆనవాళ్ళు పట్టకుండా సద్దడం లేనిపోని గొడవ అని రుషి మాత్రం కటిక నేలపైనే తన పాలిథీన్ షీటు వేసుకోని నడుం వాల్చాడు. పడుకున్నవారు కప్పుకున్న వరకు సరిచేయమని సెంట్రీకి పోబోతున్న గాండోను బతిమాలుతున్నారు. అప్పుడే గంట గడిచిపోయింది. ఒంటి వేడికి పక్క వేడెక్కుతుండగానే గాండో వచ్చి 'నాడ్యూటి అయిపోయింది లేవాలి కామ్రేడ్ మిర్కో' అంటూ మిర్కోవద్ద నిలుచున్నాడు.

నిద్ర లేవడంలో మిర్కో చాలా హుషారని దళంలో పేరుపడింది. ఆ గుర్తింపు ఒక గొప్పగానే ఫీలవుతారు. ఎందుకంటే దళాల్లో నిద్ర పెద్ద సమస్య. ఆదివాసీలు ఎప్పుడో తప్ప రాత్రి ఎనిమిదికే నిద్రపోతారు. ఒకోసారి రాత్రి చాలా సేపు ఎగిరినా పగలంతా నిద్రే. దళాల్లో అధిక శాతంలో వుండే ఆదివాసీ సభ్యులు చాలామంది యిక్కడ నిద్రసమస్యతో సతమతమవుతున్నారు. అందులో రెండవ డ్యూటీ సెంట్రీ మరీ ఇబ్బంది. నిద్ర పట్టకముందే లేపుతారు. కొందరిని నిద్రలేపితే ఆ మత్తులో ఏం చేసేవారో వాళ్ళకే తెలిసేదిగాదు. నిద్ర లేవడానికి పెట్టే యాతన, అయ్యే ఆలస్యం కూడ అంచనా వేసుకునే సెంట్రీ లేపడానికి టంచన్‌గా వస్తారు. మిర్కోకు అయితే ఒక నిముషం చాలు. మిర్కో లేచి సెంట్రీ పోయింది. తెల్లారే సరికి ఆఖరి డ్యూటీలో మూర ఉన్నాడు.

మధ్యలో సెంట్రీకి లేవడానికి మూర మహా అవస్థ పడుతుంటాడు. కమాండర్ మినహా ఎవరు లేపినా మొండికేస్తాడు. చిన్ననాడే తల్లి తండ్రులు చనిపోవడంతో మూరకి ఆపేరు ఖాయమయ్యింది. తెలంగాణా పల్లెల్లో పిల్లలు పుట్టి దక్కకుంటే, అడ్డమైన దేవుళ్ళకు మొక్కుతూ, దక్కిన పిల్లలకు మొండి, విస్తారి, పెంట, అక్కవ్వ అని పేర్లు పెట్టుకుంటారు. అలాగే ఇక్కడ తల్లి తండ్రి లేనివారిని మూర- మూరీ ఉంటారు. తొలిచూరు పిల్లలు దక్కని వారిని మయిదుర్ తప్పె (మరణించిన శిశువు తండ్రి) అంటారు.

ఇలాటి మూర దళంలోకి వచ్చిండు. ఇంటివద్ద అతడి పోషణ కాక 'గిస్సు'

చేసేవాడు. జ్ఞానం తెల్సిన ఆదివాసీ పిల్లల్ని పెంచటానికి పెద్దలు పడాల్సిన శ్రమ ఏముండదు. పిల్లలు సైతం ఏదోపని చేస్తూనే ఉంటారు. అడవిలో చదువు సంధ్యల ప్రసక్తి లేనేలేదు. ఎవరైనాసరే, పసులుకాయడానికో, కూలిపనులకో, ఎవరి దగ్గరో జీతానికో, అడవిలో ఉసిరికాయలో, కరక్కాయలో, ఇప్పపూలో ఏరుకొచ్చి షావుకారికి కొలవడానికో నిత్యం అడవిపట్టుక తిరగాల్సిందే. ఏదీ దొరక్కపోతే చేపలకో, ఉడుములకో, ఉడుతలకో, ఎలుకలకో, పందికొక్కులకో, పుట్టకొక్కులకో, కంక కొక్కులకో, పిట్టలవేటకో 'ఉదర నిమిత్తం బహుకృత వేషం' అన్నట్టు పిల్లలు పెద్దలూ కూడ తిరక్కతప్పదు. మూరడలాగే పెరిగాడు. అలా పెరుగుతున్న మూరని ఊళ్ళోకి సంఘం వచ్చింది.

ఆలనా పాలనా లేకుండా పెరిగిన మూరకి ఆకుల సీజన్ వస్తే ఆ పనితప్ప మరో ధ్యాస ఉండేదేగాదు. అయితే ఆకుల కట్టలు తీసుకోవడం అయినా, తీసుకున్న వాటికి డబ్బు ఇవ్వడం అయినా కళ్ళేదారు దయాదాక్షిణ్యమే. కాని అన్నలొచ్చి సంఘాలు పెట్టాక అదంతా తారుమారైంది. పెట్టికట్టలు బందు పెట్టడం దగ్గరినుండి కరాఖండిగా రేటు వసూలు చేయడం వరకు అన్ని పనులకు సంఘం యువకులతో పాటు మూర ఎపుడూ ముందే ఉండేవాడు. పాటలు పాడుతూ, ప్రచారం చేస్తూ రోజుల తరబడి ఊళ్ళుపట్టుక తిరిగినా, చివరకు మొండికేసే ఠేకేదార్ల పొగరు అణచి దారికి తేవడానికీ కళ్ళాలు కాలబెట్టడానికి రాత్రిళ్లు అడవిలోనే మకాం పెట్టినా ఎటుపోయాడో, ఏం తిన్నాడో, ఎక్కడ పన్నాడో అడిగేవాళ్ళు అదుపుచేసేవాళ్ళు లేకపోయారు. కానీ, ఏపని చెప్పినా కాదనకుండా నెత్తిన వేసుకొని చేసే మూరడు సంఘం పెద్దలకే కాక ఊరందరికీ కూడ తలలో నాలుకలా తయారయ్యాడు. అలా సంఘం పనులతో తల్లి తండ్రిలేని మూరడు ఊరందరికి పిల్లడు అయ్యాడు.

వెదురు కూపుల్లో పనులు, ఫారెస్టు పనులు, ఇతరత్ర కూలిపనుల్లో రేట్లు పెంచుకోవడానికి జరిగిన అన్ని పోరాటాల్లో కూడ తాను అందరితోపాటు చురుగ్గానే పనిచేశాడు. భూస్వాములు షావుకార్ల నుండి వడ్డీ వసూలు చేసినపుడు తనకొక కొత్త ప్రపంచంలో అడుగుపెట్టినట్టే అనిపించింది. ఊరి సంఘం వారే కాకుండా రేంజి సంఘం పెద్దలు, అన్నలు కూడ మెచ్చుకోవడంతో మూరకు తనపై తనకు నమ్మకం పెరిగింది.

అలాగే 'వర్క్-డే'లు, క్యాంపెయిన్‌లు, రేంజి యువకుల్లో ఆటలపోటీలు వగైరా అన్నింటిలో హుషారుగా పనిచేసిన మూరకి చిన్నప్పటినుంచి ఇంట్లో ఉంచి పెంచుకున్న కాక, కూచీల కంటే చేరదీసి పనులు చెప్తూ, బుద్ధులు నేర్పుతున్న సంఘం వాళ్ళు, అన్నలే దగ్గరివాళ్ళనిపించింది. గాలికి పెరుగుతున్న తను దళం లోనికి ఎదిగివచ్చిన తీరు తెన్నులు తలచుకుంటే మూరకు ఆనందం, ఆశ్చర్యం ఉక్కిరి బిక్కిరి చేసేయి.

ఒక్కసారిగా వర్షంమోత పెరిగింది. సెంట్రీ పాలిథీన్‌ను దగ్గరికి ముడచుకోని తడవకుండా జాగ్రత్త పడుతున్నాడు. పడుకున్నవారు కూడ ఎవరి ప్లాను ప్రకారం వారు తడవకుండ చూసుకుంటున్నారు. ఇందులో ఎవరి అనుభవం వారిదే. దళాల్లో చేరిన మొదటిరోజుల్లో పాలిథీన్ కవరు కప్పుకోరాక ఎన్ని తంటాలు పడేవారో. తుపాకులు, తూటాలు నానిపోయేవి. సరిగా ఆరని టువల్ డోర్ తూటాలు ఉబ్బి చాంబర్లో కూడోడానికి మొరాయించేవి. ఎవరి తూటాలు వారు తడుపుకోకుండా భద్రంగా చూసుకోకపోతే, పోలీసు లెదురపుతే మనపని గంగే' అని గాండో ఎప్పుడూ హెచ్చరిస్తుండేవాడు. ఎప్పుడూ టెక్ విషయాలు గుర్తుచేసే గాండో అంటే దళంలో అందరికి గురే.

పడుకున్నవారి కిందినుండి వరదలు మొదలైనయి. అయినా ఎవరూ కదల డంలేదు. నాలుగు పొరకలు వేసుకున్న గాండో ఏ పేచీ లేకుండా మెదలకుండా గుర్రు పెడుతున్నాడు. రుషి పడకమాత్రం ఆ వరదలకు ఎపుడో తడసి ముద్దయింది. అయినా చలనం లేదు. వర్షాల్లో ఇంతే అన్నట్టున్నవి వారి వాలకాలు. వీరిని తలచు కుంటే మూరనిలో తన మొదటి అనుభవం మెదలింది.

తనకు కేటాయించిన పాలిథిన్ కవరు కుట్టుకోకుండా అలానే బాగుంటుందనీ, వర్షం రాగానే అందులో దూరి రెండు పక్కల మల్చుకుంటే ఏ చీకూ ఉండదని మురిసిపోయాడు. కోలాటంలా కుట్టుకున్న వారిని చూచి అదో పెద్ద అవస్థ అని వెక్కిరించాడు కూడ. పడుకున్న కొద్దిసేపటికే కుండపోత వర్షం షురువ్ కాగానే పాలిథిన్ సంచిలో దూరి రెండుపక్కలా బిగించుకొని పదిహేను నిముషాలు హాయిగా పడుకున్నాడు. అంతే. ఇంకేం. రెండువైపులా సీల్ చేసినట్టు ఆ చివర తల కింద, ఈ చివర కాళ్ళకింద ఇరికించుకోని నెత్రతన్ని పడుకునేసరికి గాలిరాక, ఊపిరాడక

జీవన్మరణ పోరాటం చేయాల్సివచ్చింది. ఆ నిద్రలో ఏం చేయడమో తోచలేదు. బలంగా పిడికిలితో గుద్ది ఆ పాలీన్ షీటుకు రంధ్రం చేస్తేగానీ ఊపిరాడలేదు. బ్రతుకు జీవుడా అన్నట్టు తన తెలివితక్కువ పనికి తానే నవ్వుకుంటూ తెల్లవార్లు ఆ చినిగిన వరకులో జాగరణ చేశాడు. తెల్లారి లేచి తన అవస్థ చెప్పగా "బాధపడితేగాని బోధ పడదులే" అని అందరూ పడి పడి నవ్వారు. వర్షం వచ్చిన ప్రతిసారి అది గుర్తొస్తునే ఉంటది.

తన ఊహల్లో తాను పడిపోయిన మూరన్ని కిమ్ కిమ్ అంటూ అలారం ఇచ్చిన గడియారం ఈ లోకంలోనికి తెచ్చింది. తన డ్యూటీ గంట ముగిసిందన్నట్టు తెలిసింది. అందరినీ లేపడానికి కదిలాడు. ఈ కొత్త గడియారం వచ్చినప్పటి నుండి టైం చూడడం రానివారందరికి ఓ బాధ తప్పినట్టయ్యింది. గంటకో తడవ రెండు సార్లు అలారం ఇచ్చి టైం గుర్తు చేస్తుంది. 'నీ డ్యూటీ అయిపోయింది. మరొకరిని లేపు' అని హెచ్చరించినట్టే చేస్తుంది.

ఆఖరి డ్యూటీ అయిన మూర అందరిని లేపడానికి రావడం చూసిన జైని లేసి కూచుంది. ఇలాంటి వర్షంలో కొంచెమయినా, తడవకుండా హాయిగా నిద్ర పోవడం తానింకా నేర్చుకోవాలనుకుంటూనే తోటివారిని లేపడంలో మూరకి సహాయ పడింది.

'క్రామ్ప్స్' ! ఈ వర్షంలో తడవకొకరు దొడ్డికి పోతే ఈ బరువైన కిట్లతో దారిలో నిలబడలేక మేం అరిపోతం. అందుకే దయచేసి పోయేవాళ్ళు అందరు పోయిరండి ! అంటూ ఎలాగు తను నిన్ననే పోయాడు గాబట్టి మరో మూడ్రోజులు దొడ్డి కెళ్ళే ప్రసక్తే లేదన్న ధీమాతో గాండో పదే పదే కాషన్ ఇస్తున్నాడు. అదేమో గాని గాండోకు దళంలోనికి వచ్చినప్పటినుండి ఈ పద్ధతే నడుస్తుంది. ఇచ్చిన మాత్రలు ఇచ్చినట్టు మింగుతున్నా ఆ మాయదారి జబ్బు ఓ పట్టాన కుదుటపడిన లక్షణాలు కానరావడం లేదు

'ఏమో ! ఏం దొడ్డికి పోవడమో ఈ వర్షంలో' అంటూ గుణిగాడు కర్పు. కర్పు దొడ్డికి చాలా నిదానంగా పోతాడు. నిదానమే ప్రధానం అన్నది తాను దళం

లోకి వచ్చాక నేర్చుకున్న నినాదం. రోజుకు నాలుగు సార్లు పోయి నలభై నిముషాలు పాడు చేసేవారికన్నా ఏకంగా ఒకేసారి అరగంట పోయినా యింకా పదినిముషాలు ఆదాయే కదా ! అన్నదే అతని వాదన. నోట్లో వేసుకున్న పొగాకు రసమంతా తల కెక్కి ఉత్తుత్తి పిప్పి ఉమ్మేశాక గానీ అక్కడి నుండి కదలడు. అందులో పాదాల దాక పాలీన్ కప్పుకోని దొడ్డికి పోవాలంటే మహా చిరాకు. కప్పుకున్న పాలీన్ చెడిపోతే కడుక్కోలేక చావాలి మరి !

'హా లక్ష్మణా ! ఏమి ఈ నిరీక్షణా ! దొడ్డి కార్యక్రమం ముగిసేదాక లేప కుండా ఉంటే మరో అరగంట నిద్రపోయేదానిని నేను' అనుకుంటూ ఆలస్యం పాటించేవారిని మనసులో అభినందిస్తూ లేపగానే లేవాలి అని తొందర చేసే గాండోసు తదేకంగా చూస్తుంది గిరిజ.

మసక మసక చీకట్లోనే లేవడం దళం అలవాటు. అలవాటు అదో క్రమ శిక్షణగా అందరూ అలవాటు చేసుకోవలసిందే. తెలతెలవారే సమయమే శత్రుదాడికి అనుకూలమైనదనీ, గతంలో అనేక దాడులు అలాంటి వేళల్లోనే జరిగి భారీ నష్టా లెదుర్కొన్నామని రుషి పదే పదే గుర్తు చేస్తుంటాడు. ఈ మాటలు విన్నపుడల్లా తనలో ఏదో తప్పు ఫీలింగ్ వచ్చి కూచుంటుంది బద్ధకంగా లేసే గిరిజ.

దళం సింగల్ లైను ఫార్మేషన్‌లో నిల్చుంది. ఎవరి వెనకాల ఎవరు నడ వాలో చేసుకున్న నిర్ణయం ప్రకారం నిలబడ్డారు. కప్పుకున్న పాలీన్ కవర్లు గాలికి రెపరెపలాడకుండా, వర్షపు జల్లులకు ఒళ్ళు తడవకుండా బందోబస్తుగా పట్టుకొని సిద్ధంగా ఉన్నారు. ప్రంటు పైలట్స్ దుంగ - కర్పలు మాత్రం తలమీద కప్పుకో కుండా చెవులు రిక్కించి ఎలర్ట్‌గా ఉన్నారు.

"కామ్రేడ్స్ మనం ఇక్కడి నుండి అరగంటలో 'భీరాండ' చేరుకోవాలి" అనగానే దళం నడక మొదలెట్టింది.

(ఇంకా ఉంది)

కవిత్వం-గతితార్కికత :

# యాంత్రిక వైరుధ్యాలు

జె. సి.

అక్టోబరు 1990లో రవళి ప్రచురణలు, ఖమ్మం ప్రచురించిన అఫ్సర్ కవితా సంకలనం ఇవాళను, అరుణతార (128 ఏప్రిల్ 1991 పేజీలు 36-43)లో "అత్యాధునిక కవిత్వ ధోరణులపై కె. వి. ఆర్ ప్రశ్నలకు అఫ్సర్ ఇచ్చిన సమాధానాల్ని పక్కపక్కన పెట్టుకుని చూస్తే చైతన్యవంతుడైన పాఠకునికి అర్థమయ్యేది ఆయన కవితా చైతన్యం అసంఖ్యాకమైన యాంత్రిక వైరుధ్యాల పుట్ట అని అయితే ఈ లక్షణం ఆధునిక కవికి అతని కవిత్వానికి వెన్నతో వచ్చిన విద్యలో భాగమనే చెప్పాలి. మచ్చుకు ఒకటి రెండు వైరుధ్యాలు కె. వి. ఆర్ ప్రశ్నలకు అఫ్సర్ సమాధానాల నుంచి : 1) "ఏ రూపాల్లో ['కవిత్వమైనా, మరొకటైనా'] వ్యక్తం చేసినా తాను వ్యక్తం కావడమే ప్రధానం కావాలి. అంటే ప్రతి కవికి స్పష్టమైన వ్యక్తిత్వం ఉండి తీరాలి. లేకుంటే అతని వ్యక్తిత్వ ముద్ర సరిగ్గా పాఠకుడి మీద పడదు". ఇది రెండో సమాధానంలో భాగం. దీన్లోనే ఈ ఆలోచనకు సరిగ్గా వ్యతిరేక మయిన భావం : "వైయక్తిక ఆలోచన ఒక భ్రమ.... సమాజానికి, మనుషులకీ దూరంగా ఎక్కడో విసిరేసినా కూడా వైయక్తిక ఆలోచనలు ఉంటాయనుకోను." 2) "కవిత్వం ప్రాథమికంగా తన కోసమే - కానీ వ్యక్తమైన తరువాత అది పాఠకుడిదవుతుంది." ఇది నాలుగో సమాధానం. దీన్లో భాగంగానే సరిగ్గా దీనికి వ్యతిరేకమైన భావం : "పరోక్షంగానో ప్రత్యక్షంగానో ప్రతి కవికీ ఒక పాఠకుడు ఉన్నాడు. కేవలం 'తనే' పాఠకుడు కాలేదు". 3) తనదైన అనుభూతిని వ్యక్తం చేస్తున్నపుడు కూడా మనిషి కేవలం 'ఒంటరి' కాదు".

"సమాజానికీ, మనుషులకీ దూరంగా ఎక్కడో విసిరేసినా కూడ వైయక్తిక ఆలోచనలు వుంటాయనుకోను" రెండో సమాధానం నుంచి ఉదాహరణగా తీసుకున్న ఈ పరస్పర వ్యతిరేకమైన భావాలు కూడా పాక్షిక సత్యాలే.

విశ్లేషిస్తే ఇంకా ఎన్నో వైరుధ్యాలు అఫ్సర్ సమాధానాల్లో కన్పించవచ్చును కాని ఈ వ్యాస రచయిత ఉద్దేశం ప్రధానంగా అఫ్సర్ కవిత్వాన్ని సమీక్షించడమే. ఆయన ఆలోచనల్లో గూడు కట్టుకుని ఉన్న యాంత్రిక అధిభౌతిక

వైరుధ్యాన్ని ప్రత్యేకంగా సూచించడం కవితా సమీక్షకు పూర్వరంగంగా మాత్రమే. అయితే కవిత్వాన్ని ఒక సామాజిక చైతన్య రూపంగా పరిశీలించేటప్పుడు ఆ చైతన్యంలో భాగమే అయిన తాత్విక ప్రాతిపదికల్ని స్పృశించడం అనివార్యంగా జరుగుతుంది.

ఇవాళ అన్న శీర్షికగల అఫ్సర్ కవితా సంకలనంలో రెండో కవిత "నేనె ఒక సమూహం"ను పరిశీలిస్తే ఆయన దృష్టిలో వ్యక్తికి సమాజానికి, వ్యక్తికి మరో వ్యక్తికి మధ్యగల ద్వైపాక్షికత (dichotomy) అర్థమవుతుంది. కవిగా ఆయన "వ్యక్తికి, సమిష్టికీ వంతెన కట్టడమే కవిత్వ లక్ష్యం"గా పెట్టుకుని "ఈ రెండిటి మధ్య సమతౌల్యం సాధించాల" (అరుణతార 128, పే. 37)నుకున్న పైనమే కన్పిస్తుంది :

నాకు తెలుసు
నేనీ సమాజంలోకి నిర్మించుకున్న గడప
మౌనంగా పగిలిపోతుంది ఇట్లానే.
నేను వెయ్యి ముక్కలుగా
నీలోకి నీలోకి నీలోకి చీలిపోతాను
మాటలు నవ్వులుగా తడిసి బరువెక్కిన కన్నుగా కన్నీళ్ళుగా
అంగాంగం నేను నా అస్తిత్వాన్ని రాల్చుకుంటూ పోతాను.

'సమిష్టి' అంటే కవికి గతితార్కిక చారిత్రక సంబంధం లేని లేక ఆ సంబంధాన్ని నిరాకరించే వ్యక్తుల సమూహమే అన్న విషయం ఈ లైన్లలో స్పష్టం. కాకపోతే వ్యక్తి, సమిష్టి అన్న ద్వైపాక్షిక సత్యాలు గతితార్కిక సంబంధాన్ని నిరాకరించిన కారణంగా భౌతిక ఉనికినీ, ఆచరణాత్మక పరిణామాన్నీ పూర్వపక్షం చేసిన అమూర్త ప్రత్యయాలుగా మారి అధిభౌతిక లక్షణాన్ని సంతరించుకుంటాయి. అప్పుడు కూడ 'సమిష్టి' గతితార్కిక చారిత్రక సంబంధం నుండి వేరు పడ్డ అనేకానేక అధిభౌతిక అస్తిత్వాల సమూహమే అవుతుంది. ఇందులో మొదటిది వాస్తవికతా వాద (ప్రాకృతికవాద) ధోరణికి చెందిందైతే, రెండోది అస్తిత్వ వాదా (existentialism) నికి సంబంధించినది. ఈ రెండు ధోరణులూ సామాజిక చైత

న్యాన్ని పరాయీకరించి వ్యక్తుల్ని అదనపు విలువను ఉత్పత్తి చేసే సాధనాలయిన సరుకుల స్థాయికి దిగజార్చే పాలక వర్గ భావజాలంలో భాగాలే.

ఈ అర్థంలో వ్యక్తికి సమిష్టికి మధ్య అఫ్సర్ సాధించదల్చుకున్న "సమ తౌల్యం" ఒక నైరూప్య మార్మిక వాస్తవికత. దీన్నే కవి "నేనీ సమాజంలోకి నిర్మించుకున్న గడప"గా ప్రతీకరించారు. ఈ "గడప" మార్మిక వాస్తవికతగా మారిన అవాస్తవం గనుక ఇట్లానే "మౌనంగా పగిలిపోతుంది" సమాజంతో సమ తౌల్య స్థితిని సాధిద్దామనుకున్న భ్రమ విచ్ఛిన్నమయి పోయి, చివరకు కవి, సమాజం లోని ప్రత్యేక వ్యక్తులతో మమేకం కావడానికి ప్రయత్నిస్తాడు. "నేను వెయ్యి ముక్కలుగా నీలోకి నీలోకి నీలోకి చీలిపోతాను" అంటాడు కాని అట్లా చీలి పోవడం భౌతికంగానూ, చైతన్య రూపంలోనూ అసాధ్యం, అవాస్తవికం, భ్రాంతి పూర్వకం మాత్రమే. ఇంకో వ్యక్తితో, సమిష్టితో కలసి పోవడమనేది గతితార్కిక చారిత్రక సంబంధంగా - అంటే తన ప్రభావాన్ని ఇతరులపై వేస్తూ, తనను తాను మార్చుకుంటూ సామాజిక చైతన్యాన్ని అభివృద్ధి పరచుకుంటూ పోయే ప్రక్రియ - మాత్రమే సాధ్యం అన్న విషయం కవి అనుభవానికి రాని విషయం. కాబట్టి తాను చెప్పేదాంట్లో ఉన్న అబద్ధం పాలకవర్గ భావజాలంలో భాగమన్న పరిజ్ఞానం కూడా అతని కుండే అవకాశం లేదు.

ఈ అబద్ధాన్ని మినహాయించి చూస్తే కవి తనకు తాను ఎన్నెన్ని విధాల అంగాంగం విభజించుకుని తన "అస్తిత్వాన్ని" లోకంలోని ఇతర అస్తిత్వాలతో ఏ విధంగా ఐక్యం చేసుకుంటూ పోతున్నాడో కవితాపరంగా వర్ణిస్తాడు. ఎన్నో రకాల అస్తిత్వాల మధ్య తనకు తాను పోగొట్టుకుని వాటితో పూర్తిగా కలసి పోలేక తానే సమస్త అస్తిత్వ చైతన్య రూపంగా, అంటే నిరాశ, నిస్పృహ, ఏకాకితనం, ఎడారితనం, ఉన్మాదం వంటి పరాయీకరణ రూపాలతో జ్వలించే అస్తిత్వ వేద నగా రూపాంతరం చెందుతాడు. ఈ క్రమంలో,

కరచాలనం కోసం చాచిన నా చెయ్యి
కన్నీ రెండిన ఎడారి అవుతుంది
.... .... ....
నేను పాఠం చెబుతూ వుంటాను.

చెపులా, మెదడూ తెంపుకున్న పిల్లలకు
నేను కవిత్వం రాస్తూ వుంటాను
ఒయాసిస్సుల తడి ముద్దులుకూడా అక్కర్లేని ఎడారి పెదాలకు
నేను గొంతు విప్పుతూ వుంటాను.
శాంతి వచనాల వంచనా ప్రవక్తకోసం
ఎదురుచూస్తున్న ఉన్మాద సమూహాలకు—

అంటాడు కవి. అయితే తనకు, ఇతర అస్తిత్వాలకు మధ్య నైరూప్యమైన తార్కిక సంబంధం తప్ప, గతితార్కిక సంబంధం అనుభవంలో లేకపోవడంవల్ల ప్రపంచం లోని సమస్త అస్తిత్వ వేదనకు తానే ఏకపక్షంగా బాధ్యత వహించినట్లు ఫీలయ్యే పరిస్థితి కవికి ఏర్పడుతుంది. అందుకనే స్పష్టంగా ఆ బాధ్యతను తానే వహించినట్లు ఫీలవుతాడు అఫ్సర్.

నాకు తెలుసు నేను
ఎవరికీ అందనంత దూరాన్నించి
భూమిని కప్పుకొని బయలుదేరినవాణ్ణని.

ఈ ధోరణి వల్లనే అతని చైతన్యంలో ఇతరత్రా కనిపించే హేతుబద్ధమైన భావనలు కూడా సంపూర్ణ/ఆత్మాశ్రయ ధోరణిలోకి పరిణామం చెందుతాయి :

ఈ చెట్లమీంచీ ఈ నేలమీంచీ,
ఈ పిల్లకాల్వలమీంచీ ఈ కన్నీళ్ళ కలతలమీంచీ
గుప్పెడు పరిమళాల్ని మోసుకొస్తూంటానని
నాకు తెలుసు

ఈ ధోరణి చివరకు అతణ్ణి,

"నన్ను అందుకొనే చెయ్యిని
ఎక్కడో కాదు,
ఇక్కడే ఈ అరణ్యాల్లోనే వెతుక్కోవాలి
నన్ను హత్తుకునే చూపుల్ని
మరెక్కడో కాదు
ఇక్కడే ఈ జనసముద్రాల్లోనే వెతుక్కోవాలి"

అన్న భావవాదంలోకి దింపుతుంది.

"అరణ్యాలు", "జన సముద్రాలు" వంటి ప్రతీకలు పద చిత్రాలు అఫ్సర్ కవిత్వంలో వాస్తవికతావాద (naturalistic) ప్రతీకలే. వాటికున్న అర్థాలు ప్రస్తుతం వాడుకలో ఉన్న అర్థాలే. అందువల్లనే "ఈ అరణ్యాల్లో", "జన సముద్రాల్లో" అతన్నందుకొనే చేతులు, చూపులు దొరకటంకూడా కష్టసాధ్యమన్న భావం నిరాశలుకూడా ఈ లైన్లలో ఉన్నాయి.

ఈ విధంగా ఈ కవితలోని భావాలు, ప్రతీకలు అన్నీ అధిభౌతిక తర్కానికి లోబడి వున్నాయి అన్న విషయం సులభంగానే అర్థమవుతుంది. ఈ అధిభౌతిక తర్కానికి లోబడే ఫ్రెంచి సింబలిస్టు (ఫ్రెంచి ప్రతీకవాద) కవిత్వంలో డబ్లు. బి. యేట్సు, టి. యస్. ఇలియట్ వంటి ఇంగ్లీషు కవుల కవితల్లో ప్రతీకలు, పద చిత్రాలు రూపు దిద్దుకొన్నాయి. పదిహేడవ శతాబ్దానికి చెందిన డన్ మార్వెల్ వంటి ఇంగ్లీషు కవుల కవితల్లోని అధిభౌతిక ప్రతీకలు (metaphysical images) కూడ మౌలికంగా ఈ కోవకు చెందినవే. అయితే డన్‌కు, ఇలియట్‌కు మధ్యకాలంలో భౌతిక వాస్తవికత అంటే బాహిర వస్తు ప్రపంచమొక్కటే కాదని, అంతస్ చైతన్య స్థాయిలుకూడా దానిలో భాగమేనన్న విషయం కవి స్పృహకు వచ్చి వాటి నుండి కవితా ప్రతీకల నిర్మాణాన్ని చేపట్టడం జరిగింది. ఈ పరిణామంలో మన స్తత్వ శాస్త్రం, పురావస్తు శాస్త్రం, మానవ శాస్త్రం మొదలగు ఆధునిక శాస్త్రాలు నిర్వర్తించిన పాత్ర అమోఘమైంది.

అధి భౌతికవాదం మౌలికంగా అచారిత్రకమైంది కాబట్టి దాన్ని యథాతథ స్థితిని (Status-quo-ism) రక్షించడానికి పాలకవర్గాలు మంచి సాధనంగా ఉపయోగించుకుంటాయి. వాస్తవాల్ని అభావం చేసి నైరూప్య నిశ్చల ప్రత్యయాలుగా మార్చి వాటికి అధికారాన్ని కట్టబెట్టే గుణం అధిభౌతికతకుంది. శ్రమ సృష్టించిన సరుకు శ్రమకు దూరమై పాలకవర్గాల కూడిగం చేసే అమూర్త విలువగా మారడానికి కారణ భూతమౌతుంది అధిభౌతిక ధోరణి. చరిత్ర నుంచి విడదీసిన సంప్రదాయాన్ని ఒక అమూర్త విలువగా నిలబెడుతుంది. అదే విధంగా సృజనాత్మకతను కూడా ఒక నైరూప్య వైయక్తిక విలువగా కుదించి కళాకారుణ్ని, కవిని ఒక ప్రత్యేక ప్రతిభ గల వ్యక్తిగా నిరూపింప జూస్తుంది. భిన్నత్వం, ఐక్యత, సమతౌల్యం, మానవత్వం, హేతువు, అంతస్‌చేతన, దైవత్వం, అతీతత్వం వంటి నైరూప్య ఆధునిక విలువల్ని

సామ్రాజ్యవాద, పాలకవర్గాల ప్రయోజనాల్ని కాపాడటానికి వత్తాసుగా నిలబెడ్తుంది. అయితే ఈ కార్యక్రమమంతా కొంతమంది వ్యక్తులు కావాలని నిర్వహించే కార్యక్రమం కాకపోవచ్చు. వ్యక్తి చైతన్యాన్ని వైయక్తిక చైతన్యంగా నిరంతరం నైరూప్యం చేసే ఆధునిక భావజాలంగా అధిభౌతిక తర్కం సర్వత్రా వ్యాపించి ఉండటమే దానికి కారణం. సమకాలీన సమాజంలో బౌద్ధిక స్థాయిలోనే కాకుండా, అంతకంటె ఎక్కువగా సామాన్య పరిజ్ఞాన (Common sense) స్థాయిలో ప్రచారంలో ఉండి ఈనాటి కవుల్ని, రచయితల్ని కాసిస్తున్నది ఈ లక్షణం.

ఈ ఆధునిక చైతన్యంలోని అధిభౌతిక ధోరణికి భారతదేశంలో సాంప్రదాయికంగా వస్తూన్న ఆధ్యాత్మిక వేదాంత ధోరణికి విలువల్లో ఏ విధమైన వైరుధ్యం లేకపోవడంవల్ల సామ్రాజ్యవాద భావ పరిధిలో రెండూ కలిసిపోయి అర్ధవలస, అర్ధ భూస్వామ్య చైతన్యంగా పరిణామం చెందాయని, పాలకవర్గాల ప్రయోజనాల్ని కాపాడబూనే ఈ చైతన్యానికి, శ్రామికవర్గ సామ్యవాద చైతన్యానికి మధ్య అనివార్యమైన సంఘర్షణే కవిత్వరంగంలో కూడ జరుగుతుందని కొంచెం ఆలోచిస్తే సులభంగానే అర్థమవుతుంది. ఇవాళలోని అఫ్సర్ కవిత్వం కూడ ఈ అర్థంలో పాలకవర్గాల స్పృహకు దృష్టాంతమని చెప్పవచ్చును.

ఉదాహరణకు "మణికట్టుపై మహారణ్యం" అన్న కవితను పరిశీలిద్దాం. కాలాన్ని పాశ్చాత్య వైయక్తిక చైతన్యం ఒక అమూర్త వాస్తవంగా ప్రతిపాదిస్తుంది. ఈ దృష్టి ననుసరించే ఇలియట్ సంప్రదాయం, వైయక్తిక ప్రతిభ, శాస్త్ర విజ్ఞానంలను పరిమాణాత్మక ప్రత్యయాలని వర్ణించాడు. పొజిటివిస్టిక్ (వాస్తవాత్మక) విజ్ఞానశాస్త్రం కాలం, స్థలం రెండూ సాపేక్షిక (Relativistic) వాస్తవాలంటుంది. గతితార్కిక చారిత్రక వాదం స్థలకాలాలు పదార్థం ఉనికి వ్యక్తమయ్యే తీరులనీ, గతి తార్కిక సత్యాలనీ భావిస్తుంది. భారతీయ సాంప్రదాయిక దృష్టి కాలాన్ని కాల పురుషుడన్న ఒక దైవంగా మూర్తీభవింపజేస్తుంది. అఫ్సర్ తన కవితలో కాలాన్ని ఈ విధంగా ప్రతీకరిస్తాడు.

కాలం మణికట్టుపై మనిషి
నిర్మించుకున్న మహారణ్యం

సాధారణార్థంలో 'కాలం' అంటే అతనికి మనిషి తన మణికట్టుపై ధరించే గడియార

మన్నమాట. గడియారమనే ప్రత్యక్ష రూపంలో తన స్వంతం చేసుకున్న నైరూప్య వాస్తవికతే కాలం. అయితే అదే కాలాన్ని గడియారం రూపంలో తన మణికట్టుపై మనిషి నిర్మించుకున్న "మహారణ్యం" అన్న అధి భౌతిక ప్రతీక (Metaphysical Image)గా కూడ ఊహిస్తాడు కవి. అదే విధంగా ఆధునిక కవిత్వాత్మ 'అస్పష్టత' (Ambiguity) అని అనుకుంటే ఈ లైన్లలోని అస్పష్టత ఇంకో అర్థాన్ని కూడా స్ఫురింపజేస్తుంది. అది "కాలం మణికట్టుపై" అంటే కాలపురుషుని మణికట్టుపై "మనిషి నిర్మించుకున్న మహారణ్యం" కాలం అనే గడియారం అని, కాలాన్ని మహారణ్యంతో పోల్చే ఈ అధిభౌతిక ప్రతీక ఎంతగా పాశ్చాత్య వైయక్తిక చైతన్య భావాన్ని స్ఫురింపజేస్తుందో అంతగానే భారతీయ సాంప్రదాయక చైతన్య దృష్టిని స్పృహకు తెస్తుంది. ఈ అర్థవలస, అర్థ భూస్వామ్య భావజాల పరిధిలోనే ఈ కవిత చివరివరకూ తన ఉనికిని ప్రకటించుకుంటుంది.

కాలమనే మహారణ్యంలో మనిషి నిర్మించుకున్న "ఒంటరి దంతగోపురాలను" (ఊహాప్రపంచాన్ని) "ధ్వని సంగీతాల వృక్ష సమూహా"లు "క్షణాల" ముళ్ళతో గుచ్చి పరిహసిస్తాయి. "ఘనీభవించిన మంచుగదుల చుట్టూ" (అంటే కవిలో చల్లగా గడ్డకట్టుకు పోయిన ఆవేశాల చుట్టూ) మంటల కంచెల్ని సృష్టిస్తాయి. "మసిబారిన జ్ఞాపకాలను" (అంటే మరిచిపోయిన అనుభవాల్ని) రేడియం పుల్లతో తిరిగి వెలిగిస్తాయి. ధ్వని సంగీతాలనే వృక్ష సమూహాలకున్న క్షణాలనే ముళ్ళతో ఈ పనులన్నీ చేసేది కాలం అన్నభావం, అది ఒక మహారణ్యం వంటిది అన్న భావం ఈ కవితకు ప్రధానమైంది. దీనిలో కాలమనే మహారణ్యం అనేక స్థాయిల్లో విభిన్న అధిభౌతిక ప్రతీకలుగా రూపాంతరం చెందుతుంది.

క్షణాల ముళ్ళు తొడిగిన చెట్లు
ఏకాకి రెటీనా యుద్ధభూమిపై
అరాచకంగా పెరిగిపోతాయి

ఈ ప్రపంచంలో కవి ఏకాకి అన్నభావం అస్తిత్వవాదానికి మౌలికమయిన భావం. క్షణాల ముళ్ళతో కవి ఊహాప్రపంచాన్ని, చల్లారిన ఆవేశాల్ని. గతించిపోయిన అనుభవాల్ని గుచ్చి, ప్రేరేపించి, వెలిగించే ధ్వని సంగీతాల వృక్ష సమూహాల మహా

రణ్యం అంటే కాలం ఏకాకైన కవి రెటీనా (కనుపాప)పై యుద్ధభూమి అవుతుంది. ప్రపంచంలో కవి చూచే ప్రతి దృశ్యంలో ఇమిడి ఉన్న సంఘర్షణ ఆయన కను పాపపై ప్రతిఫలిస్తుంది. జీవితానికీ మృత్యువుకూ మధ్య సాగిపోయే కాలరూపమయిన యుద్ధం ఇప్పుడు కవి కనుపాప రూపాన్ని తీసుకుంటుంది. "కలల పత్ర హరితా లను చంపుకున్న / నిట్టూర్పుకు" కేంద్రమౌతుంది. అంటే కవి కలలకూ వాస్త వానికీ జరిగిన సంఘర్షణలో కవి జీవితం "నిట్టూర్పుల అరణ్యం", "యుద్ధభూమి", "రాలిన ఆకుల ఎండిన శబ్దాల"ను వినే శిశిరం, శ్మశానం అయిపోయింది.

ఈసారి
మేక్‌బెత్ కోటపైకి దండెత్తుతున్నది
వేళ్ళు తెగిన చిర్నాం ఫారెస్టూ కాదు
మనిషి కాళ్ళతో నిలబెట్టిన ఊహారణ్యమూ కాదు
కలల భారాన్ని అరచేత ధరించి బిగిపిడికిళ్ళ రూపమెత్తి
అంతరంగాల ఉక్కుకోట గోడలపైకి
ఉప్పెనలు, పొంగించడానికి తరలివస్తున్నది
నిష్పందేహంగా ఒక నిజారణ్య సమూహమే.

అట్లాగే నేరం చేశానన్న స్పృహతో కుంగిపోతున్న "మేక్‌బెత్ కోట" అయింది. "మేక్‌బెత్ కోట"ను బలానికీ, రక్షణకూ, వ్యూహానికీ సంబంధించిన కట్టడంగా కాక కలలు విచ్ఛిన్నమయి, అమానుషమైన జడత్వంతో గట్టిబడిపోయిన మేక్‌బెత్ గుండె లేక అంతరంగానికి ప్రతీకగా తీసుకోవాలి. నిట్టూర్పులతో, నేరం చేశానన్న స్పృహతో అధికార బలంతో "ఉక్కు కోట" వలె ఉన్నా నిర్జీవమై పోయిన మేక్ బెత్ అంతరంగం చుట్టూ ఎదిగిన ఉక్కు గోడల్ని ముంచెత్తడానికి విచ్ఛిన్నమయిన, కలల బరువును అరచేత ధరించి "బిగిపిడికిళ్ళ" దృఢ నిశ్చయంతో తరలి వచ్చేది మేక్‌బెత్ నాటకంలో వలె, వేళ్ళతో పెకలించిన చెట్లను ఛద్మరూపంగా వాడకుని దండెత్తిన మెక్ డఫ్ సైన్యం కాదు. అలాగే "మనిషి కాళ్ళతో నిలబెట్టిన ఊహా రణ్యమూ కాదు". అంటే వట్టి ఊహలకు సంబంధించిన వ్యర్థ ప్రయత్నమూ కాదు. కాని అది "కాలం" అను కవితను సాంతంగా చదివితే తెలుస్తుంది.

ఈసారి కవి రెటీనా లేక అంతరంగమనే యుద్ధ భూమిపై కాలం కలల్ని, జీవాన్ని చిదిమేసే మృత్యు రూపాన్ని గాక జీవితం రూపాన్ని పొందుతున్నది. ఈసారి ఒంటరితనం, నిరాశ, నిస్పృహ, నిర్జీవత్వం మీద కాలం "నిష్కారణ్య సమూహ"మై దండెత్తుతున్నది. ఈ విధంగా కాలం ఎప్పుడూ ఒకే రీతిగా ఉండదన్న భావం ఈ కవిత ప్రథమార్థంలో ప్రస్ఫుటమవుతున్నది.

కవి చైతన్యంలో కాలం "జీవన్మరణ సమస్య" అని, జీవితానికీ మృత్యువుకూ జరిగే నిరంతర యుద్ధంలో అశాంతి శాశ్వతమని, ఈ సంఘర్షణే ఎప్పుడూ ఒంటరివాడైన మనిషి అస్తిత్వానికి శాశ్వత లక్షణమన్న వేదాంత ధోరణి కవిత రెండో భాగంలో కన్పిస్తున్నది. అస్తిత్వవాద వేదాంత ధోరణులు ఎప్పుడూ మనిషిని సమాజ సమస్యల్లోంచి దూరంగా అంతర్ముఖత్వంలోకి నెట్టివేస్తాయి. దానిక్కారణం అస్తిత్వ వేదన, వేదాంత నిస్సహాయత్వాలు రెండూ మనిషికున్న సామాజిక సంబంధాన్ని నిరాకరించడమే. ఇందు కనుగుణంగానే ఈ కవితలో అఫ్సర్ అస్తిత్వ చైతన్యం.

విరిగిన చీకటి భుజస్కంధాలపై వాలి
గతం సమాధులను తవ్వుకుని
పిడికెడు మట్టి కడిపెడు దుఃఖం చేదుకున్నట్టు
చెడ్డ చేదుగా ఆలోచనలపై కప్పుకున్న మొద్దుపొర
అరమోడ్చిన కన్నుల అరలు విప్పి
లోపలి షెల్ఫులో రహస్య వస్త్రాలను తానే అపహరించుకుని

దిగంబర సముద్రాలపై ఆరేసిన అంతర్ముఖి ఆకాశంలోకి "ఆకాశంలా శాశ్వత"మైన దుఃఖంలోకి పరిభ్రమిస్తుంది. ఈ నైరూప్య ఆత్మాశ్రయ అధిభౌతిక తర్కం ప్రకారం వ్యక్తి "అంతర్ముఖి ఆకాశం"లో దుఃఖం రహస్యమైన విషయమేమీ కాదు. "ఆకాశం మీద అంటించిన వాల్ పోస్టరు" మాదిరిగా "రహస్యమయ్యే కొద్దీ అది రచ్చ కెక్కుతుంది".

ఇంతకుముందు పరిశీలించిన "నేనే ఒక సమూహం" అన్న కవితలో చెప్పినట్లు ప్రపంచంలోని అందరి అస్తిత్వ వేదన భారాన్ని కప్పుకుని బయలుదేరిన కవి ఇప్పుడు తన అంతర్ముఖి ఆకాశంలో "ఆకాశంలా శాశ్వత"మైన దుఃఖాన్ని

కూడ భరిస్తాడు. అతని అంతరంగంలో అస్తిత్వ వేదన ఎంతగా పెరిగిపోయిందంటే ఛాయా్యకాశాల మధ్యగల స్థలాన్నంతా ఆక్రమించుకుని "ఛాయా్యకాశాలు పరస్పర దూరాలను కొలుచు"కునేటందుకు ఉపయోగపడింది. "తీరాన్ని కోల్పోయి రోదిస్తూన్న సముద్రం" అయింది.

కవి అంతరంగంలో పెల్లుబికే అస్తిత్వ వేదనా ప్రపంచంలో కాలం కూడా ఆ వేదనకు ప్రతీకే అవుతుంది. కాలానికి పగలు, రాత్రి లన్న సమయ నిర్దేశాలు కూడ అవసరం లేదు. కాబట్టి కాల పురుషుడి "దిక్కుల బాహు మూలల పతన రేఖ మీంచి / సూర్యుడి శవ సూత్ర బయలుదేరుతుంది". ఇప్పుడు తన అస్తిత్వానికి అంటి ఉన్న ప్రపంచం "గది గోడల మీంచి" వాన చుక్కలుగా "వ్యథల వృథా గీతాలాల పిస్తూ" జారి పడేది కాలం కాదు. అది "నీ కలల మృత దేహం" అని కవిస్వగతం తన ఆత్మకు చెపుతున్నది.

అపున్నిజం, నిజం
గడియారం నా చుట్టూ నేను

ఎత్తయిన గోడలతో నిర్మించుతున్న కారాగారం కవి ఆత్మ, అప్పుడు అసలైన వాస్తవాన్ని గ్రహిస్తుంది. అదేంటంటే, తనిప్పుడేదైతే "నిజం" అనుకుంటున్నాడో అది గడియారంవలె యాంత్రికమైన నిర్దిష్ట విషయమనీ, క్షణాలనే ధ్వని సంగీతాల వృష సమూహాల ముఖ్య కాలం తనకు తాను ప్రకటించుకునే తాత్కాలిక విధానమనీ, కాని వాస్తవానికి కాలం అవధుల్లేని అనంతమనీ, అలాగే పైయక్తిక అస్తిత్వ వేదన కూడా క్షణికంగాక శాశ్వతమైనదనీ కవి భావం. మృత్యువుకూ జీవితానికీ మధ్య జరిగే నిరంతర సంఘర్షణే అస్తిత్వవేదననే కాలమనీ, కాలానికి వ్యక్త రూపాలు క్షణికమైన ధ్వని సంగీతాలనీ, వీటికంటే ముఖ్యమైన రూపం అవ్యక్తమైన "నిశ్శబ్దం" పరమార్థమనీ, ఈ పరమార్థాన్ని సాధించడమే మనిషి ధ్యేయమనే అద్వైత ఆధ్యాత్మిక సిద్ధాంతమే ఈ కవితకు పునాది.

గడియారం చేసే క్షణాల సవ్వడి, సంగీతం, కవిత్వం వంటి ఇంద్రియానుభూత (Sensuous) భౌతిక విషయాలన్నిట్నీ కవి శంకిస్తాడు :

క్షణాల నిశ్శబ్ద రాహిత్యాన్ని ఎప్పటికీ శంకిస్తాను
చుట్టూరా అరణ్యమై పరుచుకున్న
ధ్వని సంగీతాల వృక్ష సమూహాల్ని ఇప్పటికీ వంచిస్తాను

అంటాడు అరంభంలో కవి. కాని తనలో కూడ భాగమయి, తనను మిగతా ప్రపంచంలో భాగం చేసే ప్రకృతిని శంకించి వంచించినా దాన్ని నిరాకరించలేదు. చివరకది కవి తనను తాను శంకించుకుని ప్రపంచాన్ని వంచించడం మాత్రమే అవుతుంది.

కె. వి. ఆర్ ప్రశ్నలకు తన సమాధానాల్లో అన్నట్లు అఫ్సర్ కవిత్వంలోని అస్తిత్వ వేదన ఈ రకమయిన "పరాయీకరణ" నుంచి వచ్చిందే. కాని "సంక్లిష్టత" అస్తిత్వవాదాన్ని సామాజిక లేక శ్రమజీవన చైతన్యానికి వ్యతిరేకంగా (ఉదాహరణకు "దేవుడు మరణించలేదు" అన్న కవిత) స్వార్థప్రయోజనంగా పెంపొందించుకునే ప్రయత్నంలో పుట్టిందే. అందుకే ఈ కవితలో వాడిన అధిభౌతిక తర్కంలోని తార్కిక క్రమాన్ని తలకిందులుచేసి ప్రతిపాదనను చివరగా అనుమితి (inference)ని ప్రారంభంలో చెప్పి పాఠకుణ్ణి తికమకపెట్టే ప్రయత్నం చేశాడు కవి. సామాజిక చైతన్యరూపమయిన కవిత్వంలో ప్రతీకలు దాని ఉత్కృష్టమైన అభివ్యక్తిలో భాగమయి అభివృద్ధిచెందిన సాధనాలు కావాలి. వర్గసమాజంలోని మార్మికతను బట్టబయలు చేయడమే వాటి ప్రయోజనం కావాలి. కాని ప్రతీపవాదాన్ని (reactionary ideology) మార్మీకరించి అర్థాన్ని గోప్యం చేసే సాధనాలుగా ప్రతీకల్ని వాడితే అది కవిత్వాన్ని పాలకవర్గాల ప్రయోజనంలో భాగంగా వాడుకోవడమే అవుతుందన్న విషయం అఫ్సర్ వంటి కవులకు బహుశః అర్థం కాకపోవచ్చు.

కవిత్వంలో "అంతర్ముఖత్వం" గురించి తన సమాధానంలో మాట్లాడుతూ అఫ్సర్ అంతర్ముఖత్వానికి యూరోపులో పారిశ్రామిక విప్లవం మొదటి కారణమనీ, యంత్రంలో మనిషికి పోటీ తప్పని, మనిషిని యంత్రం రిప్లేస్ చేసే పరిస్థితులు, 1930లలో ఆర్థిక మాంద్యం ఆర్థిక పరిస్థితులు అసూహ్యమైన దాడి మనిషిని లోపలికి ముడుచుకునేట్లు చేయడం వంటివికూడా కారణాలనీ వివరిస్తాడు. "ఈ స్థితిని అధివాస్తవికులు ప్రతిభావంతంగా చిత్రించారు" (అరుణతార 128, పే. 40) అని కూడా అంటాడు. కాని ఈ కారణాలు పరిస్థితులు మాత్రమే అధివాస్తవిక కవిత్వానికి

సరిపోవు. ఆధునిక భావజాలంలోని అన్ని రకాల అధిభౌతిక భావాల్ని విధ్వంసం చేయబూనుకున్న అధివాస్తవిక చైతన్యంలో సంపూర్ణ హేత్వాభావకత రాజ్యం చేస్తూంది. "సర్రియలిజం హేతుబుద్ధి విరోధం కాదు." (అరుణతార 128, పే. 42) అన్న అఫ్సర్ ఉద్దేశం సామాన్య పరిజ్ఞాన స్థాయిని దాటిపోని ఆయన ఆధునిక దృష్టిలో భాగమనే చెప్పాల్సివస్తుంది.

అఫ్సర్ కవిత్వంలో ఆధునిక దృష్టి ఛాయలు దాదాపు అన్ని కవితల్లోనూ కన్పిస్తాయి. ఆయన వాడే ప్రతీకల్ని గమనిస్తే ఆయన కవిత్వంలో వాస్తవికతావాద ధోరణి, ప్రతీకవాద ధోరణిలోకి ఎంత సులభంగా మార్పు చెందుతుందో తెలుస్తుంది. కాని అధివాస్తవిక ధోరణి అతని ప్రతీకలకు సులభంగా అబ్బదు. ఉదాహరణకి "కర్ఫ్యూ" అన్న కవితలో,

చిరుగాలి అలల కదలికలు వినిపించకూడదు
ముఖమ్మీద విషాద కవళికలు కనిపించకూడదు
చెట్లకింద నీడలు చేతులు చాచకూడదు
పగటి ఆకాశంలో సూర్యుడి చిరునామా అనకూడదు
నలు దిక్కుల కర్ఫ్యూ

.... .... .... ....

ఎక్కడో ఈగల రెక్కలు రాలిపడుతున్న చప్పుడు
మరెక్కడో చీమల కాళ్ళు తెగిపోతున్న చప్పుడు.

సాధారణమైన వర్ణనగా కనిపించె ఈ లైన్లలోని ప్రతీకల్లో స్ఫురించే నియత నిరాశా వాదం, అధికారం, హింస యడల మన అంతస్చేతనలో ఇమిడి ఉన్న ప్రతిస్పంద నల్ని వెలికితీసే యత్నం కన్పిస్తుంది. కాని వాటిలో యాదృచ్ఛిక లక్షణం లేదు.

"చిన్నప్పటి సంగీతం - 1" అన్న కవితలో బాల్యాన్ని తిరిగి జీవించాలని కోరుతూ

అమాయకపొత్తిళ్ళ వాసన్ల ప్రపంచంలోకి
అమ్మా, మళ్ళీ నన్ను తీసుకెళ్ళు

అని తల్లిని కోరే కోరికలోని ప్రతీకలో వస్తువులో ఆదిమవాదం, రూపంలో వాస్తవికతావాదం కన్పిస్తాయి. "సంక్షోభగీతం" లో

తుదీ మొదలు చీలిపోయిన మనల్ని
ఒక చర్మం భారంగా మోసుకెళ్తుంది.

అన్న ప్రతీకలో అధిభౌతిక తర్కం, వేదాంత ధోరణీ కన్పిస్తాయి. ఇదే కవితలో,

చచ్చుబడిన చేతుల్ని రాజీ చేసి
పేంటు జేబుల్లో నిద్రపుచ్చేస్తాం

నిర్వీర్యమైన చేతుల్ని "పేంటు జేబుల్లో' నిస్సహాయంగా దాచుకోవడమనే పెటీ బూర్జువా మనస్తత్వాన్ని ప్రతీకరించిన పదచిత్రం మాత్రం యదార్థంనుండి కాక యాదృచ్ఛిక ఆలోచననుంచి వచ్చిన ప్రతీక అనిపిస్తుంది. కాని పట్టణ నాగరికత అలవాటైన వారికి ఈ ప్రతీక అంత యాదృచ్ఛికంగా అనిపించకపోవచ్చు.

"మూసిన కిటికీల వెనక" అన్న కవితలో (ఈ కవిత శీర్షిక విషయసూచికల్లో లేదు)

గదులు
ఎవరో వొదిలివెళ్ళిన జ్ఞాపకాలతో నిట్టూరుస్తున్నప్పుడు
ఏకాంతం తప్ప మరేమీ మిగుల్చుకోనప్పుడు
చూపుల వొంకీకి ఆకాశాన్ని వేలాడదీయండి

అన్న లైన్లలో అధివాస్తవిక ధోరణి ప్రస్ఫుటంగా కన్పిస్తున్నది. వీటి అర్థాన్ని వచనంలో పెడ్తే ఈ విధంగా ఉంటుంది. "సరుకుల మాయలో పరాయీకరింపబడి మనుషుల మధ్య సంబంధం వాళ్ళుండిపోయిన గదుల్లో వదిలిపోయిన జ్ఞాపకాల నిట్టూర్పుల మధ్య ఒంటరితనంగా ఘనీభవించి, ఆ గదులు ఆ ఒంటరితనాన్ని తప్ప ఏమీ మిగుల్చుకోనప్పుడు, ఒంటరి చూపులు చిలక్కొయ్యలయి మనుషుల ఆవేశాలు వాటికి వేలాడదీయాల్సినంతగా కుదింపబడ్డ ఆకాశాలైనప్పుడు" ఈ అధి వాస్తవిక చిత్రీకరణలో కూడా ప్రత్యేక ప్రతీకలు అధి వాస్తవికం కాలేకపోయాయి. "చూపుల వొంకీ" (చూపులనే వొంకీ) వాస్తవికవాద ప్రతీకగా, "ఆకాశం" (సాధారణంగా స్వేచ్ఛను సూచించే ఈ ప్రతీకలో స్వేచ్ఛలుప్తమై 'చూపుల వొంకీ'కి వేలాడదీయాల్సిన ఏకాకితనాన్ని వ్యంజించే) సింబలస్టు ప్రతీకగా మిగిలిపోయాయి. అఫ్సర్

కవిత్వంలో అధిభౌతిక భావాల గురుత్వాకర్షణ శక్తి బలంగా ఉండటమే దీని కారణం అని అనుకోవచ్చును.

చివరగా అఫ్సర్ కవితా సంకలనం శీర్షిక గురించి, "ఇవాళ" అనేది ప్రస్తుత కాలాన్ని సూచించే పదం. దీన్లోనే "ఇక్కడ" అన్న స్థల స్ఫురణకూడ సాధారణంగా ఉంటుంది. కాని స్థల కాలాలమధ్య సాధారణంగా ఉండే గతితార్కిక సంబంధాన్న టుంచి ద్వైపాక్షిక సంబంధాన్ని కూడ గుర్తించని అధిభౌతిక ప్రత్యయాన్ని చేశాడు కవి "ఇవాళ" అన్న భావాన్ని.

తన అధిభౌతిక అస్తిత్వం ఆధారంగానే సమాజంలోని మిగతా మనుషుల్ని అర్థం చేసుకొనే ఆత్మాశ్రయ భావవాద ధోరణి వల్ల ప్రపంచం మొత్తం "కాల" మనే పరమైక అస్తిత్వానికి భిన్నరూపాలనే తలుస్తాడు అఫ్సర్. భ్రూణహత్యలు, హింస, తనకుతాను పరాయివాడియ్యే మనిషి, ప్రశ్నలూ, క్షణాలు, పెదాలు, అరచేతులు పాడుబుద్ధి గుహవంటి మనిషి జీవితం, పిడికెడు అక్షరాలు, మట్టి, మరణం, రెప్పల కింద ఎప్పుడో సమాధి చేసిన చిర్నవ్వు, ఒక అగ్నిపర్వతంవంటి శ్రీ శ్రీతో కర చాలనం, గాంధీ గారి రెండో చెంప - ఏదైనా మృత్యువుకూ జీవితానికీ మధ్యజరిగే నిరంతర సంఘర్షణలో భాగమయి కాలానికి మరో రూపమే అవుతుంది ఆయన కవిత్వ తత్వ పరిధిలో. అందుకే ఆయన తన సంకలనానికి ఇవాళ అన్న శీర్షిక నెన్ను కున్నాడని అనిపిస్తున్నది.

[ఇవాళ - అఫ్సర్ రవళి ప్రచురణలు ఖమ్మం, అక్టోబర్ 1990 - 90+iv పేజీలు, 5 రూపాయలు, ప్రతులకు : కౌముది, 6-3-71, వైరారోడ్, ఖమ్మం - 2]

---

పుస్తక సమీక్ష :

# పెను ప్రమాదం

కె. వి. ఆర్

మతం నాటిదీ నేటిదీ కాదు. 'మత వర్గతత్వం' (కమ్యూనలిజం) మాత్రం నిన్న మొన్నటిదే. ఇది నేటికి 'మత ఛాందసతత్వం' (ఫండమెంటలిజం)గా ముదిరి, ప్రజాకోటి సమైక్యానికీ సామరస్యానికీ సహజీవనానికీ పెను ప్రమాదకారిగా పరిణమించింది.

మానవ సమాజం ఆదిమ దశలో భౌతిక ప్రకృతి క్రమాలను సవ్యంగా బోధపరచుకోలేక మనిషి మత విశ్వాసాలకు లోనయ్యాడు. తాను కల్పించుకున్న దైవభావానికి తానే దాసుడయ్యాడు. మానవ సమాజానికి నకలుగా పరలోకాన్నొక దాన్ని భావించుకున్నాడు. దానికి అధీనుడై విశ్వాసాలను రూపొందించుకున్నాడు. ఇలా 'పరాయీకరణ' పొందాడు. ఆ మేరకు తన మానవత్వాన్ని అన్యాక్రాంతం చేసుకుని, తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయాడు. బలాధికమైన ప్రకృతి శక్తుల ముందు దుర్బలుడుగా దీనుడుగా దుఃఖితుడుగా నిలుచున్న తొలి మానవులకు మతం లౌకిక బాధలను మరిపింపజేసింది. ఊరట గొలిపింది. మత్తు మందు అయింది.

మత సంబంధమైన కర్మకాండ వృద్ధి చెందడంతోటి దాన్ని నిర్వర్తించే పురోహిత/పూజారి వర్గం సమాజంలో పైకి వచ్చి, పరిపాలక వర్గంతో చెయ్యి కలిపి, అత్యధిక సంఖ్యాకుల శ్రమ ఫలితంలో పాలుపంచుకునే పరకష్టోపజీవిగా, మతాన్ని దోపిడీ సాధనంగా రూపొందించింది. దానికొక వ్యవస్థను నిర్మించింది. వ్యవస్థీకృతమైన మతం ఆదిమ మత విశ్వాసాలను లౌకికంగా సొమ్ము చేసుకునే ప్రబల సాధనంగా రూపొంది, వస్తూత్పత్తి విధానంలో పరంపరగా రాసాగిన సామాజిక దశ పరిణామక్రమాన్ని మీరి తన అస్తిత్వాన్ని నిలుపుకోగలిగింది. భూస్వామ్యం దానికి ఊతమిచ్చింది. హేతువాద వైఖరితో ప్రాణం పోసుకున్న పెట్టుబడిదారీ వ్యవస్థ కూడా మతాన్ని నిర్మూలించలేక పోయింది సరిగదా, దాన్ని కూడా 'సరుకు'గా మార్చుకుంది. మొత్తానికి, ఈనాటికి గూడా మతం పట్టుసడలనే లేదు.

భూస్వామిక అవశేషాలు ఇప్పటికీ బలం కోల్పోకుండానే పెట్టుబడిదారీ 'అభివృద్ధి' పంథాలో పయనిస్తున్న మన దేశంలాంటి వెనకబడిన దేశాల్లో మతం సామాజిక శక్తిగా నిలిచి ఉండడమే గాక, మత వర్గతత్వంగా విషమించి రాజకీయ రంగాన్ని సైతం వికృతం చెయ్యగలుగుతూంది. మూడు, నాలుగు శతాబ్దాల కిందట రాజకీయం నుంచి మతాన్ని విడగొట్టగలిగిన పాశ్చాత్య దేశాలనుంచి అరువు తెచ్చుకున్న 'లౌకికవాదం' (సెక్యులరిజం) 1947 తర్వాత మన దేశంలో అమలవుతూన్న తీరుని గమనిస్తే, దేశ ప్రజల అనుభవంలో ఇది ఎంతటి నామమాత్రమైనదో తెలుస్తుంది. మత వర్గతత్వ విజృంభణను ఈ 'లౌకిక' రాజ్యం అరికట్టలేకపోయింది. మత ఘర్షణలను నివారించలేకపోయింది. మతపరమైన అల్ప సంఖ్యాక వర్గాల ప్రజలకు విద్య, భాష, సంస్కృతి వంటి విషయాలలో అండగా నిలవలేకపోయింది. అక్షరాలా వారి ధన, మాన, ప్రాణాలకు రక్షణ కల్పించలేకపోయింది. మన 'లౌకికవాదం' కూడా మెజారిటీ మతవర్గతత్వంపోకి జాడ్యగ్రస్తమై పోయింది. మన రాజ్యం, దాని వ్యవస్థలూ సంస్థలూ, మత వర్గతత్వానికి పూర్తి అతీతంగా లేవన్నది కఠోరమైన వాస్తవం.

కోరలు దించి విషం నింపుతూ హిందూ మతవర్గతత్వం పడగెత్తి బుసకొట్టుతూన్న దశ ఇది. భారతీయ జనతా పార్టీ, దాని ఉపాంగాలూ, మత ఛాందస తత్వానికి అంకితమైన విశ్వహిందూ పరిషత్, బజరంగ్‌దళ్, శివసేన, త్రిశూల సేన వంటి అనేక ఇతర సంస్థలూ, ప్రజల మత విశ్వాసాలనుంచి రాజకీయ లబ్ధి పొందాలని మాత్రమే గాకుండా, జీవితం సమస్తాన్ని మతంతో నింపివేయ బూనుతున్నాయి. 'హిందూత్వం' పేరిట మతపరమైన అల్ప సంఖ్యాక వర్గాలను అత్యధిక సంఖ్యాక వర్గానికి దాసులుగా చెయ్యబూనుతున్నాయి. 'అఖండ భారత్'నే గాక, హిందూ జనాభా ఇంతో అంతో ఉన్న ఇరుగు పొరుగు దేశాలను గూడా లోబరచుకోవాలన్న హైందవ సామ్రాజ్యం కలగంటున్నాయి. నిత్య జీవిత సమస్యలను అడుగుకి నెట్టి, మందిరాల గురించి ఆందోళనలు నడుపుతున్నాయి. మతం పేరున మారణ హోమాగ్నులు రగుల్చుతున్నాయి. రాముని పేరున రాక్షసాలను ఆచరిస్తున్నాయి. 'రామ రాజ్యం' పేరున దేశప్రజల ప్రశాంత జీవనంతో చెలగాటమాడుతున్నాయి. కేంద్రంలో రాజ్యాధికారానికి చాలా చేరువకు రాగలుగుతున్నాయి. ఇది పెను ప్రమాదం.

ఈ నేపథ్యంలో 'పర్‌స్పెక్టివ్స్' ప్రచురణ సంస్థ "మత వర్గతత్వం" పేరు తోటి, హరి పురుషోత్తమరావు ఎడిట్ చేసిన ఒక చిన్న (72 పేజీలు) పుస్తకాన్ని ప్రచురించింది. "ఒక అంశంపై నిర్దిష్టమయిన దృక్పథంతో అవగాహన కలగడానికి దోహదం చేసే 'పాపులర్ రచనలు' ప్రచురించాలని" సంకల్పించి, "భారతీయ సమాజాన్ని నేడు తీవ్రంగా కలవరపరుస్తున్న మత వర్గతత్వాన్ని గురించి కొందరి ప్రముఖుల అభిప్రాయాలను 'పాపులర్ సీరీస్'లో మొదటి ప్రచురణగా వేస్తున్నాం" అని ప్రచురణకర్తలు చెప్పుకున్నారు.

'సమకాలీన మతోన్మాదపు చారిత్రక నేపథ్యం' శీర్షికతో జి. హరగోపాల్, ఎస్. హరి పురుషోత్తమరావు కలిసి రాసిన ఉపక్రమణికతోటి, అనిల్ నౌర్య రాసిన 'రాజ్యానికీ మతానికీ మధ్య సంబంధం: సంకుచిత లౌకికవాదం - సమస్యలు', మనో రంజన్ మొహంతి రాసిన 'పెత్తందారీ సెక్యులరిజం - ప్రజాస్వామ్య సెక్యులరిజం', హర్‌బన్స్ ముఖియా రాసిన 'మతతత్వ చరిత్ర రచన', రణ్‌ధీర్‌సింగ్ రాసిన 'మతతత్వ వాదపు సిద్ధాంతీకరణ', ఓలీ సోయింకా రాసిన 'మతమూ - మానవ హక్కులూ', అస్ఘర్ ఆలీ ఇంజనీర్ రాసిన 'సమకాలీన భారతదేశంలో హిందూ-ముస్లిం సంబంధాలు-ఒక విశ్లేషణాత్మక పరిశీలనను, 'ఈనాడు' దినపత్రికలో వచ్చిన అనువాద వ్యాసం, 'హైదరాబాదు మత కల్లోలాలపై ఒక రిపోర్ట్ - మత కలహాలు కావివి మాఫియా మారణకాండ' — ఇదీ ఈ పుస్తకంలోని విషయాలు. దాదాపుగా అన్నీ అనువాదాలే, వీటిలో కొన్ని "స్వేచ్ఛానువాదాలు" అనువాదకులు అనేకులు కావడాన పరిభాష ఒకే విధంగా లేదు. కొన్ని అనువాదాల్లోనయితే వాక్యనిర్మాణం కూడా సవ్యంగా లేదు. ఎడిటర్ పని కేవలం కూర్పు మాత్రమే కాదు. రచనా లోపాలను దిద్దడం కూడా అవసరం. వీటన్నిటినీ మించి, ఈ పుస్తకం గురించి నా అభ్యంతరం ఏమిటంటే, వ్యాసాలన్నీ ఏదోవిధంగా ఒకే అంశానికి సంబంధించినవే అయినా, వీటికి దేశ, కాల నిర్దిష్టత లోపించి, కలగా పులగం ఏర్పడింది. ఇంత మాత్రాన్నే ఈ పుస్తకం విలువ తగ్గదు. ఇలాంటి సంకలన గ్రంథాలకు అవసరమైంది, ఆ నిర్దిష్టతతో బాటు వస్తు ఐక్యత, దీనికి ఎన్ని కోణాలైనా ఉండవచ్చు, మరెన్ని పార్శ్వాలైనా ఉండవచ్చు. ఉండాలి కూడా. అప్పుడే విషయం అవగాహన సమగ్రం అవుతుంది.

గ్రంథాంశాలలో ప్రతి దాన్నీ సమీక్షించడం సాధ్యంకాదు గాని, ఇంజనీర్ వ్యాసంలోని ఒక అంశాన్ని మాత్రం ఎత్తి చూపాలి. "మతం అవసరం లేని సామాజిక స్థాయికి భారతదేశం ఇంకా ఎదగలేదు" (పుట 65). ఏ దేశం ఎదిగినట్టు? "సమ సమాజ స్థాపన జరగనిదే కులతత్వాన్నిగానీ మతతత్వాన్నిగానీ రూపుమాపలేం అని అర్థం చేసుకోవాలి. వనరుల అభివృద్ధి, పంపిణీలలో తేడాలు, అసమానత్వం, అన్యాయం కొనసాగినంత వరకు కుల, మత పర సంఘర్షణలు ఉంటాయి. భారత దేశం మతోన్మాదం నుంచి విముక్తి కావాలంటే సోషలిస్టు సమసమాజ స్థాపన తప్పని సరి" (పుట 67). "సోషలిస్టు సమసమాజ స్థాపన" జరిగిన, లేదా జరిగిందనుకున్న దేశాలలో ఈ మార్పు జరిగిందా? కుల, మత తత్వాలు మానవ చైతన్యంలో జీర్ణించుకుపోయిన విషయాలు. సామాజిక విప్లవం - ఆర్థిక పునాదిలో మౌలికమైన మార్పు - ఒక్కటే, ఉపరితలాంశాల నన్నింటినీ వెనువెంటనే మార్చలేదు. దీనికి సుదీర్ఘమైన పోరాటం అవసరం. ఇది భావజాల రంగంలో కూడా జరగాల్సి ఉంటుంది.

మతవర్గతత్వం తుడిచి పెట్టుకుపోవాలంటే, దానికి మూలధారభూతమైన మతం నిశ్శేషం కావాలి. హేతువాదం ఒక్కటే సరిపోదు. దానికి భౌతికవాద దృక్పథం తోడుకావాలి. నాస్తిక/నిరీశ్వర వాదమూ భౌతిక వాదమూ ఒక్కటే కాదు గాని, భౌతికవాద దృక్పథం అంతిమంగా నిలవాలంటే, నిలిచి గెలవాలంటే, దానికి నాస్తిక/నిరీశ్వరవాదం భావాయుధంగా ఉపకరించాలి. మనోరంజన్ మొహంతీ పేర్కొన్న "ప్రజాస్వామ్య సెక్యులరిజం" సార్థకమయ్యేది, మతరహిత సమాజంలోనే.

"మతము లన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును
అంత స్వర్గ సుఖంబు లన్నవి
అవని విలసిల్లున్"

అంటూ సుదూర భవిష్యద్దర్శనం చెయ్యబూనిన గురజాడకూడా, 'స్వర్గ' శబ్ద ప్రయోగమే చేసాడు. ఉన్నదొక్కటే — మానవ లోకం. ఇక్కడ మానవుడు దైవభావం

సాహిత్య లేఖలు :

## చారిత్రక ప్రజల అచారిత్రక రచన

ఐరోపా చరిత్రతో పోలిస్తే భారతదేశ చరిత్రలో అనేక విశిష్టమైన అంశాలు ఉన్నాయి. భారత చరిత్ర రచన ప్రారంభం కావటమే జాతీయ వాదం నుంచి ప్రారంభం కావడంతో చరిత్ర అనేక వక్రీకరణలకు గురైంది. మార్క్సిస్టు దృక్పథం నుంచి పరిశీలించిన రచయితలు కూడా యిందుకు మినహాయింపు కాదు. చరిత్రను గతితార్కికంగా పరిశీలించటం ద్వారానే సరిఅయిన నిర్ధారణలకు రాగలుగుతాము. గతాన్ని పరిశోధించటం అంటే భవిష్యత్తును గురించి అంచనాకు రావడమే.

మానవజాతి ఆదిమ సమాజం నుండి రెండు రకాలుగా బయటపడింది. 1. బానిస సమాజం. 2. ఆసియా సమాజం. ఈ రెండు రకాల సామాజిక నిర్మాణంతో మొదలైనాక స్థానిక వనరులు- వాటిని వినియోగంలోనికి తెచ్చిన పద్ధతులు అభివృద్ధి పథాన్ని నిర్దేశించాయి. యిందులో ఐరోపాకన్నా ఆసియా సమాజాలు ముందంజ వేశాయి. ఈ ఆర్థిక అభివృద్ధికి దారితీసిన ఉత్పత్తి విధానం ఇండియాలో స్వయం సంపూర్ణ ఆర్థిక వ్యవస్థకు పునాది వేసింది. ఈ వ్యవస్థ ఏర్పడినాక ఉత్పత్తి శక్తుల అభివృద్ధి స్తంభించి, హస్తకళలలో నైపుణ్యం పెరిగింది. సమాజంలో మిగులు ఉత్పత్తి అపార ధనరాశులుగా పేరుకుపోయింది. ఈ సంపద కోసమే ఇండియా తనకన్నా వెనుకబడిన నాగరికత ఉన్నవారిచే దురాక్రమణలకు గురైంది. 16వ శతాబ్దంలో అడుగుపెట్టిన బ్రిటిష్ వారుకూడా యిందుకు మినహాయింపుకాదు.

---

నుంచీ పరలోక భావంనుంచీ పూర్తిగా బయటపడినప్పుడే, చరిత్ర ఆదిమ కాలంలో అజ్ఞాన ఫలితంగా తాను కోల్పోయిన మానవత్వాన్ని మళ్ళీ సాధించుకుని, పరాయీకరణను అంతమొందించి, స్వాధీనతను పొందగలుగుతాడు. ఇది ఎప్పటికో!

మతవర్గతత్వం : ఎడిటర్ : హరి పురుషోత్తమరావ్
పర్స్పెక్టివ్స్, హైదరాబాదు. వెల - రు. 10
సోల్ డిస్ట్రిబ్యూటర్స్ - నవోదయ బుక్ హౌస్, నెం 3-3-865
ఆర్య సమాజ్ ఎదురుసందు, కాచిగూడ, హైదరాబాదు - 500 027

శకులు, హూణులు, ఆఫ్ఘన్‌లు, మొగలులు- యిలా అనేక మంది ఇండియాను జయించి ఈ దేశంలో కలిసిపోయారు. బ్రిటిష్‌వారు సైతం ఇండియాను జయించారు.

ఈ సమయంలోనే సమాజంలో నూతన ఉత్పత్తి శక్తులు అభివృద్ధి అవుతున్నాయి. ఈ అభివృద్ధికి ఇండియాకన్నా- ఆసియాకన్నా- ఐరోపాలోని మిగిలిన దేశాలకన్నా బ్రిటన్ సమాజమే అనువైన నిర్మాణం అయింది. ఇండియా తదితర ప్రపంచ దేశాలలో కొల్లగొట్టిన అపార ధనరాసులు బ్రిటన్‌లో పారిశ్రామిక పెట్టుబడిగా పారిశ్రామిక విప్లవం జరగటంతో బ్రిటన్ ఇండియాపైన ఆధిపత్యం సంపాదించింది.

ప్లాసీ యుద్ధంతోనే 1757 లో క్లైవ్ రాజ్యాధికారాన్ని సాధించినా 1845 లో రైల్వేలు ప్రవేశపెట్టే వరకు ఇక్కడి ఆసియాటిక్ సమాజ ప్రాథమిక నిర్మాణ రూపం (గ్రామం) ను ధ్వంసించే కార్యక్రమం ప్రారంభం కాలేదు. అంతకు ముందే లాండ్ సెటిల్‌మెంట్‌లు జరిపి—ముఖ్యంగా—నీటి పారుదల లాంటి పబ్లిక్‌వర్క్సును నిర్లక్ష్యంచేసి గ్రామసీమల్లో కరువుని సృష్టించారు. అయినా ఆసియాటిక్ గ్రామాన్ని ధ్వంసించే కార్యక్రమం రైల్వేలతోనే ప్రారంభం అయ్యింది. యిది యావా భారత దేశాన్ని వలసగా మార్చుకోవాలనే లక్ష్యంతో మొదలైంది. రైల్వేలతో బ్రిటిష్ వారు ఇండియాలో వలస ఆర్థిక విధానాన్ని నిర్మాణం చేయటం ప్రారంభించారు. అయితే ఉన్నత ఉత్పత్తి శక్తులు అనివార్యంగా పాత ఉత్పత్తి శక్తులని తోసి వేస్తాయి. ఈ చారిత్రక సత్యానికి అనుగుణంగానే ఇండియాలో బ్రిటన్ రైల్వేలు ఆసియాటిక్ సమాజాన్ని ధ్వంసం చేశాయి. ఆసియాటిక్ సమాజంలో నూతన ఉత్పత్తి శక్తుల ఆవిర్భావాన్ని-పెరుగుదలని బ్రిటిష్‌వారు ఆపలేకపోయారు.

ఆసియాటిక్ సమాజాన్ని ధ్వంసం చేయటం వలసగా మార్చుకోవడానికే కనుక అందుకు అనువైన ఆర్థిక విధానాలే బ్రిటిష్‌వారు అవలంబించారు. ముడి సరుకుల ఉత్పత్తి, తయారైన వస్తువులకి మార్కెట్‌గా ఇండియాను మార్చారు. ప్రజలకి విదేశీ వస్తువులపై మోజు పెరిగింది. దీనికి కారణం నాణ్యతగాని, పోటీ గాని కాదు. అభిరుచిలోను, నాగరికతలోను వచ్చిన మార్పు. అందుచేత ఈ వలస ఆర్థిక విధానానికి అనువైన ఉపతల నిర్మాణంగానే వలస సమాజం నిర్మితమైంది. "రూపంలో భారతీయులు-భావాలలో యూరోపియన్"ల సృష్టి జరిగింది. ఈ వలస

సమాజ లక్షణమే పాత ఉత్పత్తి శక్తుల ఉనికి. యిది 'సంలీనం' చేసుకోవటంలో ఆసియాటిక్ సమాజం యొక్క సామర్థ్యం కాదు. వలస ఆర్థిక విధానానికి అనువైన ఉపరితల నిర్మాణం. విప్లవాత్మక ఉత్పత్తి శక్తులకి పెట్టుబడిదారీ అభివృద్ధి నిరోధకత్వం తగిలించిన సంకెళ్ళు. ఈ సంకెళ్ళు తెంచే బాధ్యత ప్రజలపై పడింది.

బూర్జువా ప్రజాస్వామిక విప్లవాలు కొనసాగుతున్న కాలంలోనే వలస వ్యతిరేక పోరాటాలు కూడా ప్రారంభం అయినాయి. ఆసియాటిక్ సొసైటీలలో ఉన్నత, ఉత్పత్తి శక్తులకు-ఉత్పత్తి సంబంధాలకు వైరుధ్యం పెరిగిపోయింది. దాన్ని పరిష్కరించుకోవాల్సిన బాధ్యత వలస ప్రజానీకంపైన పడింది. దానికి ప్రారంభమే 1857 తిరుగుబాటు, తైపింగ్ విప్లవం వగైరాలు. పెట్టుబడిదారి విధానం యొక్క అభివృద్ధి నిరోధకత్వాన్ని త్వరితం చేసినవాటిలో 1) వలసల్లోని పోరాటాలు, 2) పారిస్ కమ్యూన్లను ప్రముఖంగా చెప్పాలి. పారిస్ కమ్యూన్‌తో ఈ క్రమం పూర్తికాగా రష్యా విప్లవం ఒక ఉన్నత నూతన సమాజ నిర్మాణానికి ప్రారంభం అయ్యింది.

అందుచేత ఉత్పత్తి శక్తులు-సంబంధాలకు చరిత్ర తదనడం చరిత్రను వక్రీకరించడం లేదా అర్థం చేసుకోలేకపోవటమే. అయితే యిది యిరోపా తరహా చరిత్ర కాదు. యిరోపా చరిత్రయే మానవజాతి చరిత్ర అనే భావంనుంచి బయటపడి యివ్వాళ ఉన్నత సమాజ నిర్మాణంకోసమూ-చారిత్రకంగా ఉన్నతమైన సోషలిస్టు సమాజాన్ని నిర్మించడంకోసం పోరాడుతున్న ఆసియా ప్రజల పోరాటాల వెలుగులో చరిత్రని అర్థం చేసుకుంటే ఆసియా చరిత్ర అర్థమౌతుంది.

"ఆసియాటిక్ సంలీనశక్తి" అనే అభూతకల్పనకి 'వాతాపి' వంటి జీర్ణశక్తిని యిచ్చి అది ఎన్నటికి మారని అతీతశక్తిగా ఎస్టాబ్లిష్ చేసే ప్రయత్నమే 'ఆరెస్‌రావు' వ్యాసం. ఉన్నతమైన ఉత్పత్తి శక్తికూడా ఈ సమాజాన్ని మార్చలేదు అందుచేత ఈ ఆసియాటిక్ సమాజం సోషలిజాన్ని-కమ్యూనిజాన్నికూడా తనలో 'సంలీనం' చేసుకుంటుందేగాని మారదు. లేదా సోషలిజం-కమ్యూనిజం ఆసియాటిక్ పరిణామాలకి లోబడిపోతాయి. చిరిగిపోయిన వస్త్రాన్ని విడిచి మరో వస్త్రాన్ని ధరించినట్లు ఆత్మ మరో దేహాన్ని ధరిస్తుందని భగవద్గీత బోధన. ఆత్మలాగే ఈయన దృష్టిలో ఆసియాటిక్ సొసైటీ శాస్వతం. అది దేన్నైనా లోబరుచుకుంటుంది కాని తాను మారదు. దీన్నే సర్వేపల్లి రాధాకృష్ణ భారతీయ తాత్వికత అన్నాడు. భగవద్గీత భావాలకి ఈ వ్యాసం కొత్త భాష.

శివరావు

## 'పుట్టుమచ్చ'

ఇటీవలి కావ్యాలలో ఖాదర్ మొహియుద్దీన్‌గారి 'పుట్టుమచ్చ' నాకు బాగా నచ్చింది. సంపుటం గురించి కాదు నేను రాస్తున్నది, ఆ శీర్షికతో వచ్చిన ఖండికను గురించే. కవి హృదయావేదన సహానుభూతిని కలిగించడంతో అది సాఫల్యం పొందింది, కనీసం నా విషయంలో.

"కవిత్వం - గతితార్కికత : అధిభౌతిక వైయక్తికత" అనే విలువైన వ్యాసంలో ('సృజన': జూన్ 1991), 'కసాయిబు' అంటూ శ్రీ. శ్రీ. చేసిన సంకీర్ణ శబ్ద ప్రయోగం (పోర్ట్‌మేంట్ వర్డ్) గురించీ, 'తురక' అంటూ సాంప్రదాయికంగా సుద్దాల హనుమంతు వాడిన మాట గురించీ, జె. సి. చేసిన సమర్థన సమంజసమైనదని నాకనిపించలేదు. శ్రీ. శ్రీ. చేసిన ప్రయోగంలో శబ్ద చమత్కారం ఉండవచ్చు. అన్యమతస్థులకు అంతస్తాపం కలుగుతుందని శ్రీ. శ్రీ. ఊహించి వుండడు. 'సాయిబు'కూ 'కసాయి' పనికీ అవినాభావత లేదు. మరి 'తురక' శబ్దం వాడుకలో 'ముస్లిము'ల కందరికీ పర్యాయ పదంగా మారిందని అనుకున్నా, దాని మూలం 'తుర్క్' అయినా, ముస్లిము లందరూ తుర్కులు ('తురుష్కులు') కారు. పైగా, ఆ శబ్దం వ్యవహారంలో నిందార్థాన్ని పొందింది. "తురకా బిరకా పీతిలో యేసి నరకా" లాంటి మాటలను నా చిన్నతనంలో వినివున్నాను.

"'కర్తకు మొరక తురకలు'" అనే మాటల్లో రేఫను శకట రేఫగా మార్చి మాట్లాడడం ద్వారా ముస్లిములపట్ల తీవ్రమైన తన ద్వేషాన్ని ప్రదర్శించిన హిందూ మహాసభ అభిమాని అయిన ఒక కాంగ్రెసువాది గురించి కూడా ఈ సందర్భంలో గుర్తు వస్తూంది. 'హిందూత్వం' అనబడేది ఉత్తుంగ తరంగ సన్నిభంగా ఉవ్వెత్తున లేస్తూన్న నేటి సామాజిక/రాజకీయ నేపథ్యంలో, చైతన్యవంతులైన ప్రగతివాదులు సాదా మాటల విషయంలో కూడా ఎంత జాగరూకత వహించాలో ఇలాంటివి హెచ్చరికల్లాగా పనిచేయాలి".

'వేంకటాచల విహార శతకం', 'సింహాద్రి నారసింహ శతకం' వంటి నిందా స్తుతి శతకాలలో, పిండారీ దండుకూ ముస్లిములకూ మధ్యగల భేదం ఎంచకుండానే

'తురక' శబ్దాన్ని నిందార్థంలో వాడిపున్నారు. మరి, 'ప్రతాపరుద్రీయం', 'బొబ్బిలి యుద్ధం' వంటి నాటకాలలో ముస్లిం పాత్రల నోట వికృతమైన తెలుగు మాటలు పెట్టి వేదం వేంకట నారాయణ శాస్త్రివంటి రచయితలు హాస్యాన్ని కలిగించబూనిన ఒరవడిలోనే నేటి తెలుగు సినీమాలు నడుస్తున్నాయి. చెప్పొద్దూ 'రాజీవం' నాటికలో ఖాజామియా పాత్రనోట నేనూ అలాంటి తెలుగే పెట్టాను. వృద్ధ/నవ కవి ఇస్మాయిల్ మొదలు యాకూబ్‌లాంటి ఆధునిక కవి దాకా ముస్లిం కవులంతా సలక్షణమైన తెలుగే రాయగలుగుతున్నారుగదా!

ఇక, రజాకార్లు ముస్లిములలో ఏ వర్గానికి చెందినవారన్న విషయంలోనూ జె. సి. తో పూర్తిగా ఏకీభవించలేకపోతున్నాను. ముస్లిములలో కాశిం రజ్వీ ప్రచారానికి లోబడి అపమార్గం పట్టిన మధ్యతరగతి యువకులు బొత్తిగానే లేరా?

—కె. వి. ఆర్

## కల - స్వప్నం

ఎన్. కె. కవితలో కల—స్వప్నం గురించి లింగ్విస్టిక్ అబ్జర్వేషన్స్ ఉన్నాయి. పగటి కలలు అనేది నిజం కాని కలలు అనే అర్థంలో వాడతాం. భవిష్యత్ స్వప్నాలు అనేది నిజం కాబోయే కలలు అనే అర్థంలో వాడతాం. ఈ సున్నితమైన అర్థచ్ఛాయా భేదాన్ని కవిత్వంలో బాగా ఎక్స్‌ప్లాయిట్ చేశాడు.

— చేరా, హైదరాబాద్

## కవిత్వమే !

రావిశాస్త్రి వచన రచనలైన నవలల్లో, కథల్లో కవిత్వాన్ని వెతికి (లోగా చలంలో వజీర్ రహ్మాన్ చేసినట్లు) ఆయనను కవిగా ఎస్టాబ్లిష్ చేయడం అవసరమా, కథలో, నవలలో వస్తువుకు అనుగుణమైన వాతావరణం, మూడ్, వర్ణన, భాష వంటి అవసరాల కోసం చేసిన రచనను అట్లా విడగొట్టవచ్చునా అని 'సాహితీ మిత్రులు'లో ఒకరిద్దరు వెలిబుచ్చిన సందేహాలకు జె. సి. ఇలా జవాబిచ్చారు.

" ...రావిశాస్త్రి "ఎన్నెలో ఎన్నెల"ను కవిత్వంగా ప్రచురించడంవల్ల నేనా

## స్వీకారం :

* తెలుగు సాహిత్య విమర్శలు రా. రా. మార్గం - యాకూబ్, శిలాలోలిత ప్రచురణలు, 160+XVII పేజీలు, 1/8 డెమ్మీ, రు. 20, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-1

* RESTLESS FRONTIER - Army, Assam and Its People, PUDR Report, 36 pages, Rs. 10, For Copies : Sudesh Vaid, D-2, Staff Quarters, I. P. College, Shamnadh Marg, Delhi-110 054.

* యుద్ధం - తిర్మల్ కవిత - 40+iv పేజీలు, 1/8 డెమ్మీ, ఐదురూపాయలు, ప్రతులకు : ఎస్. అరుణ, 5-52, అపోజిట్ బస్‌స్టాండ్ రోడ్, వైరా, ఖమ్మం జిల్లా 507165

* కవితా భారతి - తెలుగులో భారతీయ కవిత్వం, అను సృజన డా. దేవరాజు మహారాజు, 200 పేజీలు, 1/8 డెమ్మీ, 35 రూపాయలు. ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ 500 001

---

విధంగా రాసినా నిజానికి కవిత్వానికి, వచనానికి స్థూలంగా అవసరం పైన ఆధారపడిన రూప భేదముంది. కాని వాటి మధ్య వైరుధ్యం నిజంకాదు. రావిశాస్త్రి రాసిన Poetic prose ను Poetry గా వర్గీకరించినా తప్పేమీ కాకపోవచ్చు. ఆయన mood, వాతావరణం వంటి అవసరాలను దృష్టిలో వుంచుకొనే ఆ రకమైన ప్రోజ్ రాసాడు. కవిత్వానికయినా, వచనానికైనా రూపాన్ని కూడ నిర్ణయించి తనలో యిముడ్చుకునే చైతన్య స్వరూపమైన వస్తువు ముఖ్యం. ఏ అవసరానికి దాన్ని (వస్తువును) వాడుకుంటున్నామో ఆ రీతి ముఖ్యం.

కవిత్వం, వచనమే కాదు, రూపం, వస్తువు మొదలగు ప్రత్యయాల మధ్య యాంత్రిక వైరుధ్యంకాక గతితార్కిక వైరుధ్యం ఉంటుందని నేననుకుంటున్నాను".

* అవిశ్రాంతం - కవితా సంపుటి, సి. వి. కృష్ణారావు. 64+iv పేజీలు, 1/8 డెమ్మీ, 12 రూపాయలు, ప్రతులకు : నెలనెలా వెన్నెల, 5-ఎ, పొట్టి శ్రీరాములు నగర్, మాసాబ్ టాంక్, హైదరాబాద్ 500 457

* ఇంకా వుంది - ప్రసేన్ - 64 పేజీలు, 5 రూపాయలు, ప్రతులకు : ఇంద్రాణి, తూములోలి క్వార్టర్ నెం 6, సమత కాన్వెంట్ రోడ్, మధిర, ఖమ్మం జిల్లా

* తెలుగు కథ - 1960-85, సంకలన కర్త. వాసిరెడ్డి నవీన్, 390+6పేజీలు, 1/8 డెమ్మీ, సాదాప్రతి రు. 45, మేలు ప్రతి రు. 75. ప్రతులకు : హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ 1-1-142/బి, వివేకనగర్, హైదరాబాద్ 500 020

* బోడో సమస్య - పుట్టు పూర్వోత్తరాలు : ఆంగ్లమూలం : రాధాకృష్ణ, అను. అనంత రామారావు, 16 పేజీలు, 1/8 డెమ్మీ, రెండు రూపాయలు

* పాలు - కథలు - బి. ఎస్. రాములు, 74 పేజీలు, 1/8 డెమ్మీ, 8 రూపాయలు

* బండకింద బతుకులు - జనపదం - కైతికాల పోశెట్టి, 76 పేజీలు, 1/8 డెమ్మీ, 6 రూపాయలు

పై మూడు పుస్తకాలు ప్రతులకు : కొత్తగూడెం బుక్‌ట్రస్ట్, ఎస్. జె. నగర్, ఖమ్మం, 507 120

* సంభాషణ (కవితా సంకలనం), నందిని సిధారెడ్డి, మంజీరా రచయితల సంఘం ప్రచురణ, 76 పేజీలు, 1/8 డెమ్మీ, రూ 12. ప్రతులకు : కార్యదర్శి, మంజీరా రచయితల సంఘం, 7-3-18/1, హెడ్ పోస్టాఫీసు పక్కసందు, సిద్దిపేట - 502 103

కరపత్రం :

# చుండూరొక దిక్సూచి

పదిరికుప్పం, కారంచేడు, నీరుకొండ, కంచికచర్ల, పిప్పర, తిమ్మ సముద్రం, చుండూరు ఇవి కేవలం ఇప్పుడు ఊర్ల పేర్లు మాత్రమే కావు. దళిత ప్రజానీకంపై పాలకవర్గాలు సాగిస్తున్న హత్యాకాండలకు సంకేతాలు. భూస్వాముల కుల దురహంకారానికి ప్రతీకలు. వ్యవస్థ వెన్నుమీద పుట్టిన రాచపుండ్లు.

ఈ దారుణ మారణకాండల్లో నష్టపోయిందెవ్వరు ? లాభంపొందింది ఎవ్వరు ? 'చట్టం, న్యాయం ముందు అందరూ సమానులే' అని మన రాజ్యాంగ వ్యవస్థ చెప్పే మాటలు నిజమయ్యాయా ? పదిరికుప్పం మొదలుకొని నిన్నమొన్నటి తిమ్మ సముద్రం వరకు ఎక్కడైనా బాధితులైన దళితులకు న్యాయం జరిగిందా ? నేరస్థులకు శిక్షలు పడ్డాయా? ఈ ప్రశ్నలకు బదులుగా కోటి గొంతుకలు 'లేదు' అని సమాధానం చెబుతాయి. కారంచేడులో ఆరుగురు దళితులను హత్యచేసి, మహిళలపై దారుణంగా అత్యాచారాలు జరిపారు. ఆ దురంతాన్ని కళ్ళారా చూసి సాక్ష్యం చెబుతానని ముందుకు వొచ్చిన ఆలీశమ్మ అనే దళిత వృద్ధురాలిని హత్యచేశారు. ఇంత చేసిన అగ్రకుల నేరస్తులకు చట్టపరంగా ఏమైనా శిక్షపడిందా ? రాష్ట్ర వ్యాప్తంగా ప్రజలు ఉద్యమాలు నిర్వహించి ప్రభుత్వంపై వొత్తిడి తెచ్చినా ఫలితం లేకపోయింది. ఆరేళ్ళు గడిచిపోయాయి. ఈలోగా నీరుకొండ తదితర ప్రాంతాల్లో దళితులపై దాడులు కొనసాగాయి. కారంచేడు కేసులో నేరస్థులకు ఏ నొప్పి కలగకుండా, పోలీసులు, కోర్టు నెమ్మదిగా వ్యాజ్యం నడుపుతున్నారు. నీరుకొండలాంటి ఘటనల్లో నయితే కోర్టు యింకా కళ్ళు తెరవనేలేదు. ఇప్పటి వరకు 'చెంచురామయ్య' అనే భూస్వామి 'హత్య' తప్ప అగ్రకుల దురహంకారులకు ఏ శిక్ష పడలేదు.

### ఇలా ఎందుకు జరిగింది ?

రాజ్యం చేస్తున్న వారికీ, హంతకులకూ చుట్టరికం (వర్గకుల బంధం) వుండడంవల్ల ఎవరికీ శిక్షలు పడలేదని వేరుగా చెప్పనవసరం లేదు. కానీ, శిక్షలు పడవని మాత్రం చెప్పాలి. పాలక వర్గాల వైఖరి హంతకులలో ఆత్మ స్థయిర్యాన్ని

కల్గించిందని కూడా తప్పనిసరిగా చెప్పాలి. హంతకులలో పెరిగిన (వ్యవస్థ పెంచిన) ఆత్మ స్థయిర్యమే చుండూరులో నేటి విచ్చలవిడి హత్యాకాండకు కారణమైందని గ్రహించాలి. కనీవినీ ఎరుగని రీతిలో జరిగిన చుండూరు హత్యాకాండకు పునాది అక్కడినుంచి విశ్లేషిస్తే అర్థమవుతుంది. చుండూరు, మోదుకూరు పరిసర గ్రామాలు యిప్పుడు దళితుల శవాలతో నిండిపోయి వున్నాయి. అక్కడ కాల్వల్లో నీరు కాదు, దళితుల శవాలు, దళితుల ప్రాణాలు ప్రవహిస్తున్నాయి. దళితుల ముంగిళ్ళలో మృత్యువు నాట్యమాడుతోంది. అక్కడ భయం తప్ప మరెవ్వరూ ధైర్యంగా తిరగడం లేదు.

చుండూరు హత్యాకాండకు ప్రభుత్వ ప్రతిస్పందనలో కారంచేడు కన్నా కొంత 'ప్రగతి' కనిపించినా, అది హత్యాకాండలో వచ్చిన 'పురోగతి' ముందు ఎంత ? ముఖ్యమంత్రి చేసిన ప్రకటనలు చూసి కొందరు సంతృప్తిపడ్డారు. కానీ అదంతా బూటకమని చెప్పడానికి పెద్ద పరిశీలన అక్కరలేదు. నోటితో పలకరించి నొసలతో వెక్కిరించడమన్నమాట. జరిగిన దురంతానికి పోలీసుల రూపంలో దగ్గరుండి సహకరించిన ప్రభుత్వం, ముఖ్యమంత్రి రూపంలో ఖండించడం దోపిడీ వర్గాల దొంగనాటకం. ఇంతకీ ప్రభుత్వం యేం చేసింది ? ప్రకటనలు మాత్రమే చేసింది. నిజానికి అది చేయగలిగింది కూడా అంతే ! (ఎన్. టి. ఆర్. ప్రభుత్వం ఇది కూడా చేయలేదు. అది వేరే సంగతి.) ఆరో తేదీన సంఘటన జరిగితే వారం గడిచిపోయినా కనీసం చనిపోయిన వాళ్ళ ఎంతమందో కూడా ప్రభుత్వం కనుక్కోలేకపోయింది. కోట్ల రూపాయలు ఖర్చుచేసి హుస్సేన్‌సాగర్‌లో మునిగిపోయిన బుద్ధ విగ్రహాన్ని వెలికి తీయడానికి సిద్ధపడిన ప్రభుత్వం చుండూరు కాల్వల్లో పడిపోయిన శవాలను వెలికి తీయలేకపోయింది. గజ ఈతగాళ్ళ రావడానికి పుష్కర కాలం పట్టింది. ఇది ప్రభుత్వ అసమర్థత యెంతమాత్రం కాదు. అది దాని స్వభావం. అదే పాలకవర్గ స్వభావం. వారం రోజులపాటు తెనాలిలోని దళిత శిబిరాన్ని యాత్రా స్థలంగా మార్చివేసి రాబందులు, గద్దలకి మల్లె దళితుల మీద రోజుకొకరు వొప్పున ప్రతిపక్ష నాయకులు, ప్రభుత్వనేతలు వాలారే తప్ప ఏ వొక్కరూ దళితులలో ఆత్మ స్థయిర్యాన్ని కలిగించలేకపోయారు. పోలీసులు సరేసరి. దళితులనుంచి అగ్రవర్ణాలవారిని కాపాడడానికి ఎస్. పి. మీనా, కె. అరవిందరావు దళితులు వొదిలేసిన చుండూరులో వుండి 'డ్యూటీ' చేస్తున్నారు. తెనాలి దళిత శిబిరానికి దళిత ఉద్యమ నాయకులు, విప్లవ సంఘాలవారు రక్షణగా నిలిచారు.

పోలీసులు, పాలక రాజకీయ నాయకులు దళితులకు ఆత్మ విశ్వాసం కల్పించలేకపోయినా, అగ్రవర్ణ హంతకులకు మాత్రం ధైర్యం కల్గించారనే చెప్పాలి. కాకలు తీరిన పోలీసులు మీనా, అరవిందరావు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రతిపక్షాలు వచ్చాక కూడా అగ్రవర్ణాల వారికి భయం కలగలేదు. మోదుకూరులో శనివారంనాడు అక్కడి దళితులను చంపుతామని అగ్రకులస్తులు బెదిరించారు. చుండూరు మృతుల అంతిమ యాత్రలో పాల్గొనడానికి వస్తున్న నాగార్జున విశ్వవిద్యాలయం విద్యార్థుల లారీని పెదవడ్లపూడివద్ద 300 మంది రెడ్డి భూస్వాములు మారణాయుధాలతో అటకాయించారు. జాన్ సుమీత్ అనే దళిత విద్యార్థి నాయకుడిని, లారీ డ్రైవర్‌ని చావబాదారు. రైళ్ళమీద, బస్సులమీద చెప్పనలవికాని బూతులతో దళితులను రెచ్చగొట్టే విధంగా వినాదాలు రాస్తున్నారు. 'కూటికి గతిలేని వారికి ఇంత పొగరా?', 'కత్తిగాడు నశించాలి' వంటి కొన్ని వినాదాలు మాత్రమే ఉదహరించడానికి సాధ్యమయ్యేవి. ఈ ఘటనలన్నింటికీ పోలీసులు, వచ్చిపోయే రాజకీయ నాయకులు మౌనసాక్షులుగా మాత్రమే మిగిలిపోయారు.

ఈ దశలో దళితులు చుండూరులో ప్రతీకారానికి దిగితే (ఇంతకీ దిగారా?) ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. చుండూరులో అంతిమయాత్ర (శనివారం) రోజున అగ్రవర్ణాలవారి ఇళ్ళు తగులబడ్డాయి. ఈ ఇళ్ళు ఎవరు తగులబెట్టారు? దళితులా! అగ్రవర్ణాలవారు కేసును తారుమారు చేయడానికి తమంతట తామే చేశారా? పోలీసు సాక్షులు చెప్తున్నట్టు నక్సలైట్లా? ఈ మీమాంస పత్రికలకు వదిలేసి - దళితులే ప్రతీకారానికి పూనుకుంటే ఈ దశలో ఆశ్చర్యపడి, దిగులుపడి, దిగ్భ్రాంతికి గురి కావలసిన అవసరం వుందా? ఖండించవలసి వుందా? దళితులు తమకు లభించిన సానుభూతి ప్రతీకార జ్వాలల్లో మాడి మసైపోయిందన్న అభిప్రాయం సరైందేనా? ఈ అభిప్రాయంలో దళితులపై సానుభూతికన్నా అగ్రకులాలపట్ల ప్రేమవుందా? లేదా? ప్రశ్నలు ఇలా వేసుకోవలసి వుండగా "ఇంతమంది దళితుల్ని ఇంత దారుణంగా చంపవలసిన అవసరం రెడ్లకు, కాపులకు ఎందుకు కలిగింది? వాళ్ళ అడవాళ్ళని ఎంత ఏడిపించకపోతే, ఎన్ని అకృత్యాలు చేయకపోతే వారు ఈ దారుణానికి పాల్పడతారు? అది ఆలోచించరేం?" అని బాహాటంగా పత్రికల స్థాయిలో కాకపోయినా గుసగుస ప్రచారం మొదలైంది. స్త్రీల రక్షణపేరుతో ఈ మారణకాండను సమర్థించుకునే ప్రయత్నం ఒకటి యిప్పుడు విస్తృతంగా జరుగుతోంది.

400 మంది అగ్రకులాల స్త్రీలు ఊరేగింపుగా ఎమ్మార్వో కార్యాలయానికి వెళ్ళి తమను దళితులు "రేప్" చేస్తున్నారని మొరపెట్టుకోవడం కూడా ఈ కుటిల యత్నంలో భాగమే. ఒకవేళ అదేకనుక నిజమైతే తమ స్త్రీలను వేధించిన ఇతర కులాల పురుషుల్ని నరకడం న్యాయమైనపనే అనుకుంటే దళితులు ఎన్ని వేలో, లక్షలమందిని చంపవచ్చో, చంపాలో అగ్రవర్ణ సమర్థకులు ఆలోచించి చెప్పరేం? పెత్తందారీ అహంకారంతో దళితుల్ని దారుణంగా చంపడమేకాక అందుకు ఒక నీచ మైన నెపాన్ని కూడా అగ్రవర్ణాలవారు సిద్ధం చేసుకుంటున్నారు. ఈ అగ్రకుల భావ జాలానికి చాలామంది సులభంగా లోబడిపోయే ప్రమాదం వుంది.

చుండూరు హత్యాకాండ విడిగా జరిగిన సంఘటన కాదు. దేశవ్యాపితంగా బడుగువర్గాల ఆకాంక్షలను అణచివేస్తూ పెత్తందారీ శక్తులు దాడులకూ, హత్యలకూ పాల్పడుతున్నారు. ఈ దాడులకు ఒకచోట కులం సాధనమయితే, ఒక చోట మతం, ఒకచోట గుండా గ్యాంగులు, మరొకచోట పోలీసులు, ప్యారామిలటరీ సాధనాలవు తున్నాయి. ప్రభుత్వం అనుసరిస్తున్న తిరోగామి ఆర్థిక విధానాల ఫలితంగా బడుగు వర్గాల నూతన ఆకాంక్షలను కొంతమేరకయినా తీర్చగల సామర్థ్యాన్ని వ్యవస్థ వేగంగా కోల్పోతూవుంది. వాళ్ళు ఉద్యోగాలు కోరుకున్నా, గౌరవప్రదమయిన జీవితం కోరుకున్నా, ధరలకు తగ్గ వేతనం కోరుకున్నా అణచివేతే సమాధానం అవుతూవుంది. ఈ మధ్య దేశ ఆర్థిక విధానంలో పెద్దఎత్తున పెరిగిపోయిన విదేశీ కరణ, ప్రైవేటీకరణలు, ప్రజలకోసం పెట్టే ఖర్చులో కోత, మొదలయిన పోకడల వలన ఈ పరిస్థితి మరింత తీవ్రం అవుతుంది. ఈ నేపథ్యంలో కులపరమయిన దాడులుకూడ పెరుగుతున్నాయి.

దళితులపై పెరుగుతున్న దాడుల స్థాయిలో కాకపోయినా, ప్రతిఘటన కూడా పెరుగుతోంది. ఉత్తర తెలంగాణా, దండకారణ్యందాకా ఎందుకు చుండూరే అందుకు తార్కాణం. కారంచేడు సంఘటన జరిగి ఆరుసంవత్సరాలు గడిచిపోయినా వూరు విడిచిన దళితులు కారంచేడు చేరలేదు. బాధితులు ఊరు విడిచారు, హంతకులు వూరిలో వుండిపోయారు. చుండూరు దళితులు ఇప్పుడు కొత్త అధ్యాయాన్ని ప్రారం భించారు. సంఘటన జరిగిన నాలుగురోజులకే తమవారి శవాలతోపాటు సొంతూరు చేరారు. ఈసారి వూరువిడిచి పారిపోవడం అగ్రవర్ణ భూస్వాముల వంతయింది. ఇది రాబోయే పరిణామాలకు నాందీ ప్రస్తావన !

12-8-'91 విప్లవ రచయితల సంఘం

విజయవాడ కృష్ణాజిల్లా యూనిట్

రాడికల్ ప్రచురణ

## ఐ. ఎం. ఎఫ్. అప్పు - పాలకవర్గాల కుట్ర

**రు. 2-50**

ప్రతులకు :

పీస్ బుక్ సెంటర్,

1-8-518/16/2, వేంకటేశ్వరాలయం దగ్గర,
చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020

---

ఎ.పి.సి.ఎల్.సి., ఓ.పి.డి.ఆర్. ప్రచురణ :

గుంటూరు జిల్లా చుండూరు దళితులపై
అగ్రకుల దురహంకారుల హత్యాకాండ

## నిజనిర్ధారణ కమిటి నివేదిక

**రు. 1-00**

ప్రతులకు :

సి. భాస్కరరావు,
ఓ.పి.డి.ఆర్, ప్రధాన కార్యదర్శి,
నగరం, తెనాలి ఆర్. ఎమ్. ఎస్.
గుంటూరు జిల్లా.

డా॥ కె. బాలగోపాల్,
ఎ.పి.సి.యల్.సి. ప్రధాన కార్యదర్శి,
శాతవాహన మెస్ వెనుక,
నారాయణ గూడ, హైదరాబాదు.

SRJANA Telugu Monthly August 1991

Regd. No. with the Registrar of Newspapers for India 10953/67

# సృజన రేటు, సంవత్సర చందా పెంచక తప్పడంలేదు

సృజనకు ఆర్థికంగా, హార్దికంగా సహకరించవలసినదని చేస్తున్న విజ్ఞప్తికి ముఖ్యంగా మనసు విప్పి చెప్పుకున్న ఇబ్బందులకు కొందరు పాఠకులనుంచయినా మంచి ప్రతిస్పందన వచ్చింది.

అయితే కేంద్ర ప్రభుత్వ బడ్జెట్ రూపంలో వచ్చిన ఐ. ఎం. ఎఫ్. దాడికి పత్రికలుకూడా తాళలేనంత దెబ్బతిన్నవి. న్యూస్‌ప్రింటు ధర నలభై శాతం పెరిగిపోయింది. న్యూస్‌ప్రింటు కోటాకూడా లేని సృజన వంటి పత్రికలకు ఈ రేటు రెట్టింపు పెరిగినట్లు లెక్క.

పత్రికకయ్యే ఖర్చు సాధారణంగా కాగితానికి సగం, ప్రింటింగుకు సగం అవుతుంది (లెటరు ప్రెస్ కంపోజింగులో) కనుక పెరిగిన కాగితం ధర నలభై శాతమే లెక్కవేసుకున్నా అరవై పేజీల పత్రికకే మరో రూపాయి రేటు పెంచక తప్పదు. మేం ఇటీవల కాలంలో 70 పేజీలకు తగ్గి ఎప్పుడూ సంచిక ఇవ్వలేదు. గత సంచిక 106 పేజీలు 5 రూపాయలకే ఇచ్చాం.

ఇప్పుడే మూల్గే నక్కమీద తాటిపండు పడ్డట్లు బడ్జెట్ న్యూస్‌ప్రింటు ధర పెంచింది.

ఇకనుంచి తప్పనిసరిగా 64 పేజీల

విడి ప్రతి 5 రూపాయలు సంవత్సర చందా 50 రూపాయలు

చేయక తప్పడంలేదు.

అన్నీ గ్రహించగల సృజన పాఠకులు సహకరించగలరని ఆశిస్తాం.

'సాహితీమిత్రులు'

SRJANA Rs. 5/-

Flat 11, Block 2,
MIG II, Baghlingampalli,
Hyderabad-500 044.